# సోవియట్ యూనియన్ 1971-75 పంచవర్ష ఆర్థికాభివృద్ధి ప్రణాళిక గురించి సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 24వ మహాసభ ఆదేశాలు

సోవియట్ యూనియన్ మంత్రిమండలి అధ్యక్షులు

అలెగ్సీ కొసిగిన్

నివేదిక

1971, ఏప్రిల్ 6

సంపుటి 5, సం. 20 సోవియట్ సమీక్ష ఏప్రిల్ 30, 1971

2

**SOVIET SAMEEKSHA** (Telugu) Vol. 5, No. 20
Apr. 30, 1971

# DIRECTIVES OF THE 24TH CONGRESS OF THE COMMUNIST PARTY OF THE SOVIET UNION FOR THE FIVE-YEAR ECONOMIC DEVELOPMENT PLAN OF THE USSR FOR 1971 - 75

*A Report by*
**ALEXEI KOSYGIN,**
*Chairman*
*of the Council of Ministers*
*of the USSR*
*April 6, 1971*

CONTENTS



సంపాదకుడు: వి. ఆర్. కుల్లంద
మేనేజింగ్ సంపాదకుడు : వై. యల్. ఫ్రొలోవ్
కళాకారుడు : ఇ. తలనోవ్

9 భారతీయ భాషల్లో
వెలువడే పత్రిక





మద్రాసులోని సోవియట్ దేశ కాన్సలేట్ జనరల్ కార్యాలయ సమాచారశాఖ
(44, త్యాగరాయ రోడ్, మద్రాసు-17) తరపున ఎ. ఎ. ఫిలిపెంకోచే
శ్రీ వేంకటేశ్వరా ప్రింటర్స్, మద్రాసు-21లో ముద్రింపబడి ప్రచురింపబడినది.

## విషయసూచిక



అలెగ్సీ కొసిగిన్

# 5

కామ్రేడ్ ప్రతినిధులారా!

ఈ మహాసభవారి పరిశీలనార్థం సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ, 1971-1975 సోవియట్ దేశ ఆర్థికాభివృద్ధి పంచవర్ష ప్రణాళిక ముసాయిదా ఆదేశాలను సమర్పించింది. ఈ పత్రం, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 23 వ మహాసభ చేతనూ, కేంద్రకమిటీ విస్తృత సమావేశాల చేతనూ రూపొందించబడిన పార్టీ ఆర్థిక విధానాన్ని మరింత వివరిస్తుంది. కమ్యూనిస్టు నిర్మాణం ప్రస్తుతదశలో నిర్వర్తించవలసిన కర్తవ్యాలను, వాటిని అమలు జరిపే మార్గాలను ఈ విధానం నిర్వచిస్తోంది.

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి ఎల్. ఐ. బ్రెజ్నెవ్ సమర్పించిన కేంద్రకమిటీ నివేదిక, 23 వ మహాసభ తరువాత పార్టీ సంపాదించిన అనుభవాన్ని సమగ్రంగా క్రోడీకరించింది. ప్రస్తుతదశలో పార్టీ అనుసరించవలసిన ఆర్థిక విధాన ప్రధాన సమస్యలను నిర్దేశించింది. ఆ నివేదిక, అంతర్జాతీయ పరిస్థితికి, దేశంలోని పరిస్థితికి మార్క్సిస్టు-లెనినిస్టు విశ్లేషణ నిచ్చింది. పార్టీ ఆంతరంగిక జీవితానికి సంబంధించిన సమస్యలను గురించీ, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థను మరింత సంఘటిత మొనర్చడానికి, అంతర్జాతీయ కమ్యూనిస్టు, కార్మిక ఉద్యమాలను అభివృద్ధి పరచేందుకు, ఇతర దేశాలలోని సోదర పార్టీలతో మన పార్టీకున్న స్నేహ సంబంధాలను బలపర్చుకోడానికీ సంబంధించిన కర్తవ్యాలను పరిశీలించింది.

గత ఐదేళ్ళ కాలంలోనూ సోవియట్ సమాజ జీవితంలో పార్టీ నాయకత్వ పాత్ర అధికమైంది. పార్టీ యొక్క సైద్ధాంతిక, నిర్మాణ ఐక్యత అభివృద్ధి చెందింది. ప్రజలతో దాని సంబంధాలు మరింత బలపడ్డాయి. సోవియట్ ప్రజలకు సమరశీల అగ్రశ్రేణిగా వుండే తన మహోన్నత కర్తవ్యాన్ని పార్టీ ఘనంగా నెరవేర్చింది.

పార్టీ నికరంగా అనుసరించిన లెనినిస్టు విదేశాంగ విధానం మూలంగా, అత్యంత క్లిష్టమైన అంతర్జాతీయ పరిస్థితిలో సోషలిజం స్థానాలు మరింత పటిష్టమయాయి. సామ్రాజ్యవాద దురాక్రమణ శక్తుల ప్రతిఘటన అధికమౌతున్నప్పటికీ, శాంతి కోసమూ, అన్ని దేశాల స్వతంత్ర అభివృద్ధి కోసమూ, సాంఘిక పురోగమనం కోసమూ సాగే పోరాటంలో నూతన విజయాలు సాధింపబడ్డాయి.

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ నివేదికపై ఈ మహాసభలో జరిగిన చర్చ, మన పార్టీ శ్రేణుల మధ్య నున్న సైద్ధాంతిక ఐక్యత యొక్క ఉన్నత స్థాయిని, లెనినిస్టు పార్టీతోనూ, దాని కేంద్రకమిటీతోనూ మన దేశంలోని అన్ని జాతుల ప్రజలకూ ఉన్న దృఢమైన ఐక్యతనూ, అతి స్పష్టంగానూ, విశ్వసనీయంగానూ తెలియజేసింది. ఎల్. ఐ. బ్రెజ్నెవ్ నివేదికపై మహాసభ ప్రతినిధులు చేసిన ప్రసంగాలు పార్టీ కేంద్ర కమిటీ కార్యకలాపాలకు యిచ్చిన ఘనమైన విలువ, ఆ ప్రసంగాలలో ఉన్న నిర్దిష్టమైన, నిర్మాణాత్మకమైన, సైద్ధాంతిక-రాజకీయ స్వభావమూ, మన సమాజపు పాదార్థిక, సాంస్కృతిక జీవితపు ప్రతి రంగంలోనూ పార్టీచే నిర్వహింప బడుతూన్న అపారమైన కృషిని గురించి సంపూర్ణంగానూ, సవిస్తరంగానూ తెలియజేస్తున్నాయి.

పార్టీ నాయకత్వం కింద సోవియట్ ప్రజలు విప్లవ పోరాటంతోనూ, వీరోచిత శ్రమతోనూ నిండి ఉన్న మహత్తర మార్గంలో పయనించారు. దేశభక్త మహా యుద్ధంలో మనం సాధించిన విజయం, చాలా దేశాలకు శాంతిని, జాతీయ స్వాతంత్ర్యాన్నీ సమకూర్చింది; ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ప్రాదుర్భావానికి అనుకూల పరిస్థితులను కల్పించింది. యుద్ధానంతరం సోవియట్ ప్రజలు, యుద్ధంలో శత్రువుచే నాశనం చేయబడిన పట్టణాలను, గ్రామాలను చాలా తక్కువ వ్యవధిలోనే పునర్నిర్మించుకున్నారు. సాంఘిక ఉత్పత్తిని 1940లో ఉన్నదానికి ఎనిమిది రెట్లకు పైగా ఎక్కువ చేశారు. జాతీయ ఆర్థిక వ్యవస్థకు నూతన సాంకేతిక సాధన సంపత్తిని సమకూర్చుకున్నారు. కమ్యూనిస్టు నిర్మాణంలో నూతన కర్తవ్యాలను విజయవంతంగా నెరవేర్చడానికి కావలసిన గట్టి పునాది వేయబడింది.

సోవియట్ ప్రజల మహోజ్వల సృజనాత్మక కృషిచే, ప్రపంచంలో ప్రథమ సోషలిస్టు దేశానికి చేకూర్చబడిన బలం, అన్ని దేశాల శ్రామిక ప్రజలకూ ఒక గర్వ కారణంగానూ, ఆశాజ్యోతిగానూ వుంది.

మన ఆర్థిక నిర్మాణ పథకాలు, కమ్యూనిస్టు సమాజ నిర్మాణమనే మహత్తర లక్ష్య సాధనకై రూపొందించ బడ్డాయి. తొమ్మిదవ పంచవర్ష ప్రణాళిక ముసాయిదా ఆదేశాలు యూనియన్ రిపబ్లిక్‌ల కమ్యూనిస్టు పార్టీల మహాసభలలోనూ, ప్రాంతీయ మండల, నగర, జిల్లా పార్టీ మహాసభలలోనూ, పార్టీ సంస్థలలోనూ, శ్రామిక ప్రజల సమావేశాలలోనూ, పత్రికలలోనూ చర్చించబడ్డాయి. ఆ మహాసభలలోనూ, సమావేశాలలోనూ

ప్రసంగించిన వారందరూ కూడ, కమ్యూనిజానికి కావలసిన పాదార్థిక, సాంకేతిక ప్రాతి పదికను నిర్మించడానికీ, ఆర్థిక వ్యవస్థాభివృద్ధి వేగాన్ని హెచ్చించడానికీ, ప్రజల జీవన ప్రమాణాలను యింకా పెంచడానికీ పార్టీ అనుసరించే విధానానికి తమ ఆమోదాన్ని ఏక గ్రీవంగా వ్యక్తపరిచారు. ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక అభివృద్ధికి సంబంధించిన సమస్యలపై వుపయోగకరమైన, గాఢమైన అభిప్రాయాలు చాలా వెల్లడించబడ్డాయి. అవన్నీ జాగ్రత్తగా పరిశీలింప బడతాయి. వాటిలో కొన్ని ఈ మహాసభ యిచ్చే ఆదేశాలలో ప్రతిబింబిత మౌతాయన్నది స్పష్టం. మిగిలినవి పంచవర్ష ప్రణాళిక ముసాయిదాలోనూ, ఆచరణలో దానిని అమలు జరిపేటప్పుడూ పరిశీలించ బడతాయి.

ముసాయిదా ఆదేశాలపై జరిగిన చర్చ, మన పార్టీ అనుసరించే విధానం గురించి శ్రామిక ప్రజా బాహుళ్యానికి ఉన్న ప్రగాఢ అవగాహనను, దానికి వారిచ్చే హృదయ పూర్వక అండదండలను, సోవియట్ సమాజాభివృద్ధికి సంబంధించిన ప్రధాన సమస్యలను పరిష్కరించడంలో వారు నిర్వహించే చురుకైన పాత్రను నిరూపిస్తుంది. నూతన పంచవర్ష ప్రణాళికా కాలానికి వేసుకున్న బ్రహ్మాండమైన కార్యక్రమం విజయవంతంగా నెరవేరుతుం దనేందుకు యిదే హామీ.

# I
# 8 వ పంచవర్ష ప్రణాళికను నెరవేర్చడంలో సాధించిన ఫలితాలు

కామ్రేడ్ ప్రతినిధులారా, ఎనిమిదవ పంచవర్ష ప్రణాళికను నెరవేర్చడంలో సాధించిన ముఖ్యమైన ఫలితాలను గురించీ, ఆ ప్రణాళిక కాలంలో మన ఆర్థికవ్యవస్థలో వచ్చిన మార్పులను గురించీ నివేదించేందుకు నన్ను అనుమతించండి.

గత అయిదేళ్ళ కాలంలోనూ సాధించిన అత్యంత ముఖ్యమైన ఫలితం ఏమంటే, పార్టీ 23 వ మహాసభ నిర్దేశించిన రాజకీయ, కీలక సాంఘిక - ఆర్థిక కర్తవ్యాలు విజయవంతంగా నెరవేర్చబడటం.

ప్రణాళిక లక్ష్యాలు వాస్తవంలో ఎలా నెరవేర్చబడ్డాయో తెలిపే సంక్షిప్త సూచికలు ఈ క్రింది విధంగా వున్నాయి.

| | 1965 పై 1970 శాతాలు<br>23 వ మహాసభ ఆదేశాలు | వాస్తవంలో నెరవేర్పు |
|---|---|---|
| జాతీయాదాయం | 138-141 | 141 |
| మొత్తం పారిశ్రామిక ఉత్పత్తి | 147-150 | 150 |
| అందులో: | | |
| ఉత్పత్తి సాధనాలు | 149-152 | 151 |
| వాడకం సరకులు | 143-146 | 149 |
| పెట్టుబడులు (ఐదేళ్ళకు మొత్తం, అంతకు ముందు ఐదేళ్ళపై శాతం) | 147 | 142 |
| అన్ని రకాల రవాణా సాధనాల ద్వారా చేర వేయబడిన మొత్తం సరకుల పరిమాణం | 137 | 138 |
| ప్రభుత్వం, సహకార సంస్థలు నిర్వహించిన చిల్లర వ్యాపారం | 140కి తక్కువ కాకుండా | 148 |
| కార్మికుల, ఆఫీసు ఉద్యోగుల సగటు వేతనాలు | 120కి తక్కువ కాకుండా | 126 |
| వ్యవసాయక్షేత్రాల సాంఘికఉత్పత్తినుంచి సమిష్టి వ్యవసాయదారులకు నగదు రూపంలోనూ, వస్తు రూపంలోనూ వచ్చే నెలసరి సగటు ఆదాయాలు | 135-140 | 142 |
| సామాజిక వినిమయ నిధులనుండి ప్రజలకు లభించే చెల్లింపులు, సౌకర్యాలు | 140కి తక్కువ కాకుండా | 153 |
| తల ఒక్కంటికి ప్రజలకు లభించే వాస్తవ ఆదాయాలు | దాదాపు 130 | 133 |

గత అయిదేళ్ళలోనూ, సగటు సాలుసరి వ్యవసాయోత్పత్తి 21 శాతం పెరిగింది వ్యవసాయోత్పత్తిలో ప్రణాళికా లక్ష్యాలు ఎలా నెరవేర్చబడినదీ ఈ క్రింది వివరాలు చూస్తే తెలుస్తుంది:

1966-1970 మధ్యకాలంలో సగటు సాలుసరి ఉత్పత్తి
(మిలియన్ టన్నులలో)

| | ప్రణాళిక లక్ష్యాలు | నెరవేర్పు | నెరవేర్పు శాతం లెక్కలో |
|---|---|---|---|
| ధాన్యం | 167 | 167.5 | 100.3 |
| ముడిపత్తి | 5.6—6.0 | 6.1 | 108.9-101.7 |
| చక్కెర దుంప | 80 | 81 | 101.3 |
| సూర్యకాంతం పువ్వుగింజలు | 6 | 6.37 | 106.2 |
| బంగాళాదుంప | 100 | 94.8 | 94.8 |
| కూరగాయలు | 21.6 | 19.3 | 89.4 |
| మాంసం (కళేబరాల బరువు) | 11 | 11.6 | 105.4 |
| పాలు | 78 | 80.5 | 103.2 |
| గుడ్లు (వెయ్యి మిలియన్లు) | 34 | 35.8 | 105.3 |
| ఉన్ని (వెయ్యి టన్నులు) | 391 | 397 | 101.5 |

పై అంకెలు, ఎనిమిదవ పంచవర్ష ప్రణాళికను నెరవేర్చడంలో సాధింపబడిన గణనీయమైన విజయాలను తెలియజేస్తాయి.

దేశ రాజకీయ జీవితంలో, గత అయిదేళ్ళ కాలంలోనూ సోషలిస్టు వ్యవస్థ, సోవియట్ సమాజపు సైద్ధాంతిక, రాజకీయ ఐక్యత, కమ్యూనిస్టు పార్టీతోనూ దాని కేంద్ర కమిటీతోనూ సోవియట్ ప్రజల సంఘీభావమూ మరింత పటిష్టమయాయి. కార్మికవర్గానికీ, రైతాంగానికీ మధ్య బాంధవ్యమూ, సోవియట్ యూనియన్‌లోని అన్ని జాతుల ప్రజలమధ్య స్నేహమూ, సోదర సహకారమూ మరింతగా బలపడ్డాయి. సోషలిస్టు ప్రజాస్వామ్యం మరింత అభివృద్ధి చెందింది.

ఆర్థికాభివృద్ధి రంగంలో, 8 వ పంచవర్ష ప్రణాళికను నెరవేర్చడంవల్ల జాతీయ ఆర్థిక వ్యవస్థ మరింత ఉన్నతస్థాయికి పెరిగింది. శాస్త్ర, సాంకేతిక అభివృద్ధి యొక్క, ఉత్పత్తి యొక్క, శ్రామిక ఉత్పాదకశక్తి యొక్క పెరుగుదల వేగాలు హెచ్చాయి. సామాజిక ఉత్పత్తి మరింత సమర్థవంతం అయింది. జాతీయ ఆర్థికవ్యవస్థ యొక్క విభాగ నిర్మాణం మెరుగైంది. దేశం యొక్క ఆర్థికవ్యవస్థ యావత్తునూ మరింత అభివృద్ధి పరచడానికి అనుకూల పరిస్థితులు సృష్టించబడ్డాయి.

సామాజిక రంగంలో, ప్రజా జీవితంలో పాదార్థిక ప్రమాణము, సాంస్కృతిక స్థాయి పెంచబడ్డాయి. కార్మికుల, సమిష్టి వ్యవసాయదారుల వృత్తి విద్యా, సాంకేతిక శిక్షణా స్థాయి మెరుగు పర్చబడింది. గతంలో వలెనే దేశంలోని ఉద్యోగార్హత కల వారందరికీ పూర్తి ఉపాధి కల్పించబడింది. పట్టణానికీ, గ్రామానికీ మధ్యనూ, శారీరక శ్రమకూ, మానసిక శ్రమకూ మధ్యనూ ఉన్న ముఖ్యమైన వ్యత్యాసాలను క్రమంగా తొలగించడం లాంటి ప్రధాన సాంఘిక కర్తవ్యాలను నెరవేర్చడంలో ఒక ముఖ్యమైన చర్య తీసుకొనబడింది.

కామ్రేడ్ ప్రతినిధులారా, మన సమాజపు అభివృద్ధికి సంబంధించిన ప్రతి రంగంలోనూ అద్భుతమైన విజయాలు సాధింపబడినవని మీకు విశదం. మన సమాజం యిది వరకటికంటె ఎక్కువ ఏకరూప మైనదిగానూ, పొందిక గలదిగానూ, ఐక్యత గలదిగానూ, బలమైనదిగానూ తయారైంది. సామాజిక ఉత్పత్తిలో లక్ష్యంగా పెట్టుకున్న పెరుగుదలను సాధించడానికీ, భారీ యెత్తున సామాజిక చర్యలను అమలు జరపడానికీ సహజంగానే విస్తారమైన వనరులు అవసరమవుతాయి. ఈ వనరుల విషయంలో సోవియట్ ప్రభుత్వానికి గల ఏకైక మూలాధారం శ్రామిక ప్రజలచే ఉత్పత్తి చేయబడే జాతీయ ఆదాయమే. అందుచేతనే జాతీయ ఆదాయం పెరుగుదల వేగాన్ని హెచ్చించడం పట్ల ప్రత్యేక శ్రద్ధ వహించబడింది. ఏడవ పంచవర్ష ప్రణాళిక కాలంలో జాతీయ ఆదాయం 32 శాతమూ, ఎనిమిదవ పంచవర్ష ప్రణాళిక కాలంలో 41 శాతమూ పెరిగింది.

జాతీయ ఆదాయం పంపిణీలో నిష్పత్తులు కూడా మారాయి. ఏడవ పంచవర్ష ప్రణాళిక కాలంలోనూ, అంతకు పూర్వపు పంచవర్ష ప్రణాళికల కాలంలోనూ (యుద్ధానంతరపు మొదటి పంచవర్ష ప్రణాళిక కాలం మినహా) పోగు చేయబడే నిధి, ప్రజోపయోగ నిధికంటె బాగా ఎక్కువ వేగంతో పెరిగింది. 8 వ పంచవర్ష ప్రణాళికలో ఈ పెరుగుదల వేగాలను సన్నిహిత మొనర్చడానికి అవకాశం కల్పించబడింది. ఆ పని సాధించబడింది. 8 వ పంచవర్ష ప్రణాళిక కాలంలో ప్రజోపయోగ నిధిలో పెరుగుదల 56.8 వేల మిలియన్ రూబుళ్లు అయింది. 7 వ పంచవర్ష ప్రణాళిక కాలంలో ఈ నిధి పెరుగుదల 31.4 వేల మిలియన్ రూబుళ్ళు. అంటే, పోగు చేయబడే నిధి పెరుగుతూ ఉండగానే, ప్రజోపయోగ నిధి దాదాపు రెట్టింపు అయిందన్న మాట. పర్యవసానంగా, అభివృద్ధి చెందిన సోషలిస్టు సమాజంలో జాతీయ ఆర్థిక వ్యవస్థాభివృద్ధి వేగం హెచ్చడంతో పాటుగానే ప్రజల జీవన ప్రమాణాలు కూడా త్వరితగతిని పెరుగుతూ వుంటాయి. సోషలిస్టు తరహా ఉత్పత్తి స్వభావమే యిందుకు మూలం. శ్రమ ఫలితాన్ని శ్రామికులకు దక్కకుండా చేసే పద్ధతినీ, దోపిడి చేసే వర్గాలు శ్రామిక ప్రజల ఉత్పాదక కార్యకలాపాల ఫలితాలను భుక్తం చేసుకొనే పద్ధతినీ సోషలిస్టు తరహా ఉత్పత్తి అంత మొందించింది.

మన ప్రణాళికా రచనలో ఒక ప్రధాన సమస్య జాతీయ ఆదాయపు పెరుగుదల

త్వరితగతిని సాగేటట్లు చూడటం, దేశం యొక్క శక్తి సామర్థ్యాలు బలపడేందుకూ, శ్రామిక ప్రజల జీవన ప్రమాణం పెరగడానికీ జాతీయ ఆదాయం సరిగా పంపకం అయేటట్లు చూడటం. ఉత్పత్తి పరిమాణాలను నిర్ణయించడానికి సంబంధించిన సమస్యలు, జాతీయాదాయం పంపిణీకి సంబంధించిన సమస్యలూ, ప్రతి సంవత్సరం, జాతీయ ఆర్థిక ప్రణాళికలనూ, ప్రభుత్వ బడ్జెటులనూ తయారు చేసేటప్పుడూ, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ విస్తృత సమావేశాలలోనూ, సోవియట్ దేశ సుప్రీమ్ సోవియట్ సమావేశాలలోనూ చర్చించేటప్పుడూ, పార్టీ కేంద్రకమిటీ చేతనూ, ప్రభుత్వం చేతనూ పరిశీలింపబడతాయి.

అయితే, గత అయిదేళ్ళ కాలంలోనూ వచ్చిన జాతీయ ఆదాయం ఎలా వినియోగించబడింది?

గత అయిదేళ్ళలోనూ వచ్చిన జాతీయ ఆదాయం మొత్తం 1,166,000 మిలియన్ రూబుళ్లు. ఈ అంకెయొక్క పరిమాణాన్ని గుర్తించడానికి మనం ఒక విషయాన్ని జ్ఞాపకం చేసుకోవాలి. ఏడవ పంచవర్ష ప్రణాళిక కాలంలో (1961-1965) వెరసి జాతీయ ఆదాయం 840 వేల మిలియన్ రూబుళ్లు. యుద్ధానికి పూర్వపు అయిదేళ్ళలో (1936-1940) యిది 154 వేల మిలియన్ రూబుళ్లు మాత్రమే వుంది. (వీటన్నిటికీ 1965 ధరలు ప్రాతిపదికగా తీసుకొనబడ్డాయి.)

8వ పంచవర్ష ప్రణాళిక కాలంలో జాతీయ ఆదాయంలో దాదాపు ముప్పాతిక వంతు ప్రజోపయోగం క్రిందికి పోయింది.

ఉదాహరణకు, ఉత్పత్తి రంగంలో కార్మికులు, ఆఫీసు ఉద్యోగులు తమ వేతనాలుగానూ, సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతులు తమ ఆదాయాలుగానూ పొందిన 518 వేల మిలియన్ రూబుళ్లు శ్రామికుల చేతనూ, వారి కుటుంబాల చేతనూ వినియోగించుకొనబడ్డాయి.

విద్యాబోధన కోసమూ, ప్రజారోగ్య రక్షణ కోసమూ, ప్రజల సాంస్కృతిక అవసరాలనూ, నిత్య అవసరాలనూ, సామాజిక అవసరాలనూ తీర్చేటందుకు 199 వేల మిలియన్ రూబుళ్లు ఖర్చు చేయబడ్డాయి.

అశక్తులైన వారిని (అంగవైకల్యం పొందినవారూ, వృద్ధ కార్మికులూ, యుద్ధంలో వికలాంగులైనవారూ, తాత్కాలికంగా అశక్తులైనవారూ) పోషించేటందుకూ, విద్యార్థుల స్కాలర్‌షిప్పులకూ, గ్రాంటులకూ దాదాపు 80 వేల మిలియన్ రూబుళ్లు ఖర్చు చేయబడ్డాయి.

విజ్ఞానశాస్త్ర రంగం కింద 41 వేల మిలియన్ రూబుళ్లు ఖర్చు చేయబడ్డాయి.

అంటే, జాతీయ ఆదాయంలో ఎక్కువ మొత్తం ప్రజోపయోగం క్రిందికి పోయింది. అయినప్పటికీ సామాజిక ఉత్పత్తిని యింకా విస్తృత మొనర్చడంపట్ల కూడా మనం

నిరంతర శ్రద్ధను కనబరచవలసి వుంటుంది. అందుచేతనే జాతీయ ఆదాయంలో ఒక భాగం, 186 వేల మిలియన్ రూబుళ్లు ఉత్పత్తి పోగుపడటానికి ఖర్చు చేయబడింది. అంటే, ఫ్యాక్టరీలలోనూ, మిల్లులలోనూ, రైల్వేలలోనూ, ఇతర పారిశ్రామిక సంస్థల లోనూ ప్రధానమైన ఉత్పత్తి ఆస్తులను విస్తరింపజేయడానికీ, సరకుల, పదార్థాల నిలవలను అధికం చేయడానికీ వినియోగింపబడ్డాయన్న మాట.

గత అయిదేళ్ళలోనూ నివాస గృహాలను ఎక్కువ చేయడానికీ, పాఠశాలలు, ఆస్పత్రులు, సాంస్కృతిక, తదితర సంస్థల నిర్మాణాలకూ అయిన ఖర్చు 62 వేల మిలియన్ రూబుళ్లు.

ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితిలో సోవియట్ ప్రభుత్వం, దేశరక్షణ పాటవాన్ని పటిష్టం చేయడం పట్ల నిరంతర శ్రద్ధ వహించవలసి వుంది. గత అయిదేళ్ళలోనూ దేశ రక్షణ అవసరాల కోసం 80 వేల మిలియన్ రూబుళ్లు ఖర్చు చేయబడ్డాయి.

మన దేశంలో జాతీయ ఆదాయపు పంపకం, సోషలిస్టు సూత్రాలననుసరించీ, సోష లిస్టు ఆర్థిక వ్యవస్థయొక్క అభివృద్ధిని శాసించే భౌతిక నియమాలననుసరించీ అమలు జరుపబడుతుంది. ఈ సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ ఉత్పత్తి సాధనాలపై సామాజిక యాజ మాన్యం అనే అభేద్యమైన పునాదిమీద ఆధారపడి వుంది. మార్క్స్, ఎంగెల్స్, లెనిన్‌ల రచనలలో శాస్త్రీయంగా వివరించబడిన ఈ సూత్రాలు మన పార్టీ కార్యక్రమంలో చేర్చ బడ్డాయి. సోషలిస్టు ఆర్థిక మేనేజిమెంటుకు ప్రాతిపదికగా ఉపయోగపడతాయి.

జాతీయ ఆదాయపు పెరుగుదల, శ్రామిక ప్రజల ప్రయోజనాలను తీర్చేటందుకు దానిని పంపకం చేయడం, 8వ పంచవర్ష ప్రణాళిక కాలానికి పార్టీ 23వ మహాసభ ఆదేశాలు నిర్ణయించిన సాంఘిక కర్తవ్యాలను విజయవంతంగా నెరవేర్చడాన్ని సాధ్యమయేటట్లు చేశాయి.

గత అయిదేళ్ళ కాలంలోనూ కార్మికుల, ఆఫీసు ఉద్యోగుల సగటు వేతనాలూ, జీతాలూ కనీసం 20 శాతం పెరగడానికి ప్రణాళిక అవకాశం కలిగించింది. కాని వాటిలో వాస్తవంగా వచ్చిన పెరుగుదల 26 శాతం. ప్రణాళిక ప్రకారం సామాజిక ఉత్పత్తినుంచి సమిష్టి వ్యవసాయదారులకు నగదు రూపంలోనూ, వస్తు రూపంలోనూ లభించే ఆదాయాలు 35-40 శాతం పెరగవలసి వుండగా వాస్తవంలో అవి 42 శాతం పెరిగాయి. గత అయి దేళ్ళ కాలంలోనూ ప్రజలకు తల ఒక్కంటికి వచ్చే వాస్తవ ఆదాయం 33 శాతం పెరి గింది. ఏడవ పంచవర్ష ప్రణాళిక కాలంలో ఆ పెరుగుదల 19 శాతం మాత్రమే. ప్రజల వాస్తవ ఆదాయాల పెరుగుదలకు సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 23వ మహాసభ నిర్ణయించిన లక్ష్యం, అనుకున్న దానిని మించి నెరవేర్చబడిందని మనం సంతృప్తితో చెప్పవచ్చు.

ప్రజల జీవన ప్రమాణం పెరుగుదలకు చిల్లర వర్తకం పెరుగుదల ఒక ముఖ్యమైన సూచిక. 1970లో 153.6 వేల మిలియన్ రూబుళ్ళ విలువగల చిల్లర వర్తకం జరిగింది.

ఇది 1965లో జరిగిన వర్తకంమీద 48.4 శాతం ఎక్కువ. అయినప్పటికీ కొన్ని సరకుల ఉత్పత్తిలో వచ్చిన పెరుగుదల, అధికమౌతున్న ప్రజానీకపు నగదు ఆదాయాల కంటె వెనుకబడే వుంది.

కొన్ని రకాల సరకుల విషయంలో, అందులో ప్రత్యేకించి మాంసము, మాంసం సరకుల విషయంలో, 8వ పంచవర్ష ప్రణాళిక కాలంలో వాటి సాలుసరి వాడకం తల ఒక్కంటికి సగటున ఏడు కిలో గ్రాములు పెరిగినప్పటికీ, ప్రజల అవసరాన్ని తీర్చడంలో మనకింకా కొన్ని చిక్కులు వున్నాయి.

నానాటికీ అధికమవుతున్న ప్రజావసరాలను తీర్చడం పట్ల యింకా ఎక్కువ శ్రద్ధ వహించవలసి వుంది. నూతన పంచవర్ష ప్రణాళికను రూపొందించడంలో రానున్న కొలది సంవత్సరాలలోనూ సరకుల విషయంలో ప్రజల అవసరాలను మరింత పూర్తిగా తీర్చే టందుకు గల అన్ని అవకాశాలను గురించి ఆలోచించవలసిన అవసరం కూడా వుంది. అఖిల యూనియన్, రిపబ్లికన్, స్థానిక అధికార సంస్థలూ కూడ, వాడకం సరకుల ఉత్పత్తిని పెంచడానికీ, వర్తకాన్ని మెరుగు పర్చడానికీ సంబంధించిన సమస్యలపై నిరంతరం తమ దృష్టిని కేంద్రీకరించాలి.

*గృహ నిర్మాణం* బాగా పెరగాలన్నది 8వ పంచవర్ష ప్రణాళిక కాలానికి ముఖ్యమైన కర్తవ్యాలలో ఒకటిగా సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 23వ మహాసభ నిర్ణయించింది. అందుకోసం గత అయిదేళ్ళ కాలంలోనూ దాదాపు 60 వేల మిలియన్ రూబుళ్లు ఖర్చు చేయబడ్డాయి. 11,350,000 యిండ్ల వాటాలు నిర్మింపబడ్డాయి. అంతర్జాతీయ గణాంక వివరాలను చూస్తే గత అయిదేళ్ళలోనూ ప్రపంచంలో, ఏ యితర దేశమూ కూడ యిన్ని యిళ్ళ వాటాలను నిర్మించి వుండలేదని తెలుస్తుంది. అయినప్పటికీ, మనదేశంలో జనాభా కంతకూ ప్రమాణం ప్రకారం వుండవలసినంత గృహవసతి వుందని యిప్పుడే చెప్ప జాలము. రానున్న సంవత్సరాలకు కూడా యిది ఒక తీవ్రమైన సమస్యగానే వుంటుంది.

*ప్రజానీకపు సాంస్కృతిక పరిస్థితులనూ, నిత్యజీవన పరిస్థితులనూ మెరుగు పర్చడానికి* చాలా కృషి జరిగింది. థియేటర్ల, సినిమా హాలుల, క్లబ్బుల, లైబ్రరీల సంఖ్య పెంచబడింది. వార్తా పత్రికల, పుస్తకాల, మేగజైనుల ముద్రణలు బాగా పెరిగాయి. టెలివిజన్ సెట్లు, రేడియో సెట్లు, రెఫ్రిజిరేటర్లు, బట్టలుతికే యంత్రాలు, విద్యుత్ సాధనాలు యిళ్ళలో విస్తారంగా ప్రవేశపెట్టబడ్డాయి. గ్యాసు సరఫరా గల యిళ్ళ వాటాల సంఖ్య రెట్టింపుకు మించి పెరిగింది.

*పౌర విద్యారంగంలో* చాలా కృషి జరిగింది. 1939 జనాభా లెక్కల ప్రకారం సోవియట్ యూనియన్‌లోని పట్టణాలలో నివసించే మొత్తం శ్రామిక ప్రజలలో 24.2 శాతం మంది, గ్రామీణ ప్రజలలో 6.3 శాతం మంది మాత్రం సెకండరీ (పూర్తి లేదా, అసంపూర్తి) విద్యనో, ఉన్నత విద్యనో పొంది వున్నారు.

1970 జనాభా లెక్కల ప్రకారం పట్టణాలలోని శ్రామిక ప్రజలలో 75 శాతం మంది, గ్రామీణ ప్రజలలో 50 శాతానికి పైగానూ సెకండరీ, లేదా ఉన్నత విద్యను పొంది వున్నారు. ప్రజల విద్యాస్థాయి, సాంస్కృతిక స్థాయి త్వరితగతిని పెరగడమనేది సోష లిస్టు వ్యవస్థ సాధించిన ఒక గొప్ప విజయం.

ఆరోగ్య సౌకర్యాలను అభివృద్ధి చేయడంలో మనం సాధించిన విజయాలు కూడ గణనీయమైనవే. ఆస్పత్రులు, పోలీక్లినిక్‌లు, వ్యాధుల చికిత్స కోసం, నివారణ కోసం నిర్మింపబడిన యితర వైద్యసంస్థల, శానిటోరియంల, ఆరోగ్య కేంద్రాల, విశ్రాంతి గృహాల సంఖ్య పెంచబడింది. బడికి పోయే వయస్సింకా రాని బాలబాలికల కోసం నెల కొల్పబడిన సంస్థలు యిప్పుడు ఎక్కువ అయాయి. కొన్ని నగరాలలోనూ, పారిశ్రామిక కేంద్రాలలోనూ బాలల సంస్థల అవసరాలు యిప్పుడు తీర్చబడ్డాయి.

గత అయిదేళ్ళ కాలంలోనూ అమలు జరుపబడిన ఒక ముఖ్యమైన సాంఘిక చర్య, కార్మికులకు, ఆఫీసు ఉద్యోగులకు వారానికి అయిదు రోజులే పని, రెండు రోజులు సెలవు వుండే పద్ధతిని, దశల వారీగా అమలులోకి తీసుకురావడం. కార్మికులకూ, ఆఫీసు ఉద్యోగు లకూ జీతంమీద యిచ్చే సెలవుల కనీస పరిమితి పొడిగించబడింది.

సోషలిస్టు ఉత్పత్తిని విజయవంతంగా అభివృద్ధిపరచడం ద్వారా జాతీయ ఆదాయం పెరుగుదలలో అధిక వేగమూ, ప్రజల జీవన ప్రమాణంలో పెరుగుదలా సాధించబడ్డాయి. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 23వ మహాసభచే ఆమోదింపబడిన ఆర్థిక సంస్కరణ మూలం గానే సోషలిస్టు ఉత్పత్తిలో అభివృద్ధి చాలవరకు సాధింపబడింది.

1970లో జరిగిన మొత్తం పారిశ్రామిక ఉత్పత్తి విలువ 373 వేల మిలియన్ రూబుళ్లు. ఇది అంతకుక్రితం అయిదేళ్ళ కాలంలో జరిగిన ఉత్పత్తి కంటె 50 శాతం ఎక్కువ.

ఆధునిక శాస్త్ర, సాంకేతిక విజయాల ప్రాతిపదిక మీద పరిశ్రమల్లో ముఖ్యమైన గుణాత్మక మార్పులు జరిగాయి. ఇంజినీరింగు, లోహకార పరిశ్రమలలో ఉత్పత్తి 74 శాతమూ, రసాయనిక, పెట్రో రసాయనిక పరిశ్రమలలో ఉత్పత్తి 78 శాతమూ, విద్యు చ్ఛక్తి పరిశ్రమలో ఉత్పత్తి 54 శాతమూ పెరిగాయి.

పరిశ్రమల్లో వచ్చిన అభ్యుదయకర మార్పులు చాలవరకు, దాని ముడిపదార్థ పునా దిని విస్తృత మొనర్చడం, కొత్త ఖనిజవాయు, చమురు, ఇనుము, అయోరహిత లోహాల నిక్షేపాలను, వజ్రాలు మొదలైన యితర ఖనిజ నిక్షేపాలను కనిపెట్టడం మూలంగానూ కూడా జరిగాయి. ఉదాహరణకు సర్వే చేయబడిన ఖనిజవాయు నిక్షేపాలు యిప్పుడు 16,000,000 మిలియన్ ఘనపు మీటర్లకు పైబడి వున్నాయి. వాటిలో గత అయిదేళ్ళ కాలంలోనూ సర్వే చేసిన నిక్షేపాలు 13,000,000 మిలియన్ ఘనపు మీటర్లకు మించి వున్నాయి. ఈ నిక్షేపాలను కనిపెట్టడానికి వున్న ప్రాముఖ్యత ఎంతో ఈ క్రింది వాస్త

వాన్ని బట్టి తెలుస్తుంది. నేడు దేశంలోని ఇంధనంలో దాదాపు 60 శాతం చమురు, ఖనిజ వాయువులే అయివున్నాయి. 1965లో ఈ శాతం 51 మాత్రమే. ప్రాచ్య ప్రాంతంలో ఒక పెద్ద చమురు, ఖనిజవాయు కేంద్రం నెలకొల్ప బడింది. సైబీరియాలోనూ, దూరప్రాచ్యం లోనూ త్వరితగతిని అభివృద్ధి చెందుతూన్న ఆర్థిక వ్యవస్థయొక్క అవసరాలను త్యూమెన్ లోని సమృద్ధి అయిన చమురు గనులే పూర్తిగా తీరుస్తున్నాయి. కొద్ది కాలం క్రితం వరకూ సైబీరియాకు చమురు పశ్చిమ ప్రాంతం నుంచి సప్లయి చేయబడుతూ వుంది. ఇప్పుడు సైబీరియాయే తన చమురు నిధులలో కొంత భాగాన్ని పశ్చిమ ప్రాంతాలకూ, తూర్పు ప్రాంతాలకూ కూడ గొట్టాల ద్వారా పంపుతోంది.

సహజ వనరులను అభివృద్ధి చేయడంతోపాటే చౌకగా, మంచి నాణ్యం గల కృత్రిమ పదార్థాలు కూడా ఉత్పత్తి చేయబడి, పరిశ్రమలలో మరింత విరివిగా ఉపయోగింప బడుతున్నాయి.

పరిశ్రమల్లో వచ్చిన గుణాత్మకమైన మార్పులు మరో విషయంలో కూడా కనబడ తాయి. అదేమిటంటే, మునుపటికన్నా ఎక్కువ ఉత్పాదక శక్తిగల యంత్రాలు నానాటికీ మరింత విస్తృత స్థాయిలో పరిశ్రమల్లో ఉపయోగింపబడుతూ వుండటం. ఉదాహరణకు, విద్యుదుత్పాదక యంత్రాల శక్తిసామర్థ్యాలలోనూ, ప్రాథమిక దశలో చమురును శుద్ధి చేసే యంత్రాల, యితర రసాయనిక యంత్రాల శక్తిసామర్థ్యాలలోనూ, బ్లాస్ట్ ఫర్నేసుల, కన్వర్టర్ల పరిమాణాలలోనూ గణనీయమైన పెరుగుదల వుంది. రైలుపెట్టెల, ఓడల, క్రేనుల వాహకశక్తి, ట్రాక్టర్ల, లారీల, తవ్వకపు యంత్రాల, ఇంకా అనేక యితర, యంత్ర వ్యవస్థల శక్తిసామర్థ్యాలు పెంచబడ్డాయి. పెద్ద యంత్రాలను ఉపయోగించడం మూలంగా శ్రామిక ఉత్పాదకశక్తిని బాగా పెంచడమూ, ఒక్కొక్క ప్రామాణిక పరిమాణం ఉత్పత్తికై పెట్టే పెట్టుబడులను బాగా తగ్గించడం సాధ్యమవుతుంది.

ఇంజినీరింగు పారిశ్రామిక రంగానికి కొత్త సాంకేతిక యంత్ర సాధనాలను సమ కూర్చటం జరుగుతూ వుంది. ఆధునిక పరికరాల, స్వయంచలిత ట్రాన్స్ఫర్ లైనుల, ఎల క్ట్రానిక్ కంప్యూటర్ల ఉత్పత్తి బాగా పెంచబడింది. వివిధ యంత్రాల సృష్టినుంచి మనము యంత్ర వ్యవస్థలను తయారు చేసే దశకు వెడుతున్నాము. దీనివల్ల శ్రమను యాంత్రికం చేయడమనే జటిలమైన కర్తవ్యాన్ని నెరవేర్చటం సాధ్యమవుతుంది. ఉత్పత్తి నియంత్రణ ఏర్పాట్లుగల యంత్రాలను తయారు చేయడంవల్ల, సంక్లిష్టమైన రూపాలలో వున్న వస్తువు లను ముందే నిర్ణయించిన కార్యక్రమాన్ని అనుసరించి తయారు చేయడానికీ, పనిలో కచ్చితత్వాన్ని పెంచడానికీ, చిన్న చిన్న బ్యాచీలలో ఉత్పత్తిని స్వయంచలితం చేయడానికీ వీలయింది.

గత అయిదేళ్ళలోనూ, సోషలిస్టు గ్రామీణ ప్రాంతపు జీవితంలో గొప్ప మార్పులు వచ్చాయి. సమిష్టి వ్యవసాయ క్షేత్రాల, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల పదార్థిక, సాంకేతిక

ప్రాతిపదికను పటిష్ట మొనర్చడానికి చాలా కృషి జరిగింది. గ్రామీణ ప్రాంతాలకు విద్యుచ్ఛక్తిని సప్లయి చేయడంలో ముఖ్యమైన చర్య తీసుకొనబడింది. భూమిని మెరుగుపర్చే పని భారీ ఎత్తున అమలు జరుపబడింది. సమిష్టి క్షేత్రాలకూ, ప్రభుత్వ క్షేత్రాలకూ వ్యవసాయక యంత్రాల, ఎరువుల, రసాయనాల సరఫరా బాగా ఎక్కువ చేయబడింది. పంట రాలుబళ్ళు, పశు సంవర్ధన కేంద్రాల ఉత్పాదకశక్తి పెంచబడ్డాయి. అన్నిరకాల వ్యవసాయ సరకుల ఉత్పత్తినీ పెంచటం జరిగింది. దీనిమూలంగా ప్రభుత్వం చేసే ధాన్యం కొనుగోళ్ళు, పారిశ్రామిక పంటల కొనుగోళ్ళు, పాలు, మాంసం, ఇతర సరకుల కొనుగోళ్ళు పెంచడానికి వీలయింది.

అధికమవుతూన్న వ్యవసాయోత్పత్తుల కొనుగోళ్ళు ఈ విధంగా వున్నాయి:

| | సాలుసరి సగటు కొనుగోళ్లు (మిలియన్ టన్నులలో) | | |
|---|---|---|---|
| | 1961-1965 | 1966-1970 | 1961-65 తో పోల్చి చూస్తే 1966-1970లో శాతం లెక్కలలో |
| మొత్తం ధాన్యం | 51.6 | 66.0 | 128 |
| అందులో: ముతక నూక | 1.6 | 2.6 | 163 |
| వరి | 0.21 | 0.67 | 324 |
| పత్తి | 5.0 | 6.1 | 122 |
| చక్కెర దుంప | 55.4 | 74.4 | 134 |
| సూర్యకాంత పువ్వుగింజలు | 3.4 | 4.7 | 138 |
| బంగాళాదుంపలు | 8.4 | 11.0 | 131 |
| కూరగాయలు | 6.7 | 9.4 | 140 |
| మాంసం (కళేబరాల బరువు) | 5.2 | 7.3 | 139 |
| పాలు | 31.1 | 43.2 | 139 |
| గుడ్లు (వెయ్యి మిలియన్ లెక్కలో) | 8.7 | 14.4 | 166 |

విస్తారమైన *పరిశ్రమాదుల నిర్మాణ* కార్యక్రమాన్ని అమలు జరిపి వుండక పోతే సోషలిస్టు పరిశ్రమను, వ్యవసాయాన్ని అభివృద్ధి చేయడం, ప్రజల జీవన ప్రమాణాన్ని పెంచడం అసాధ్యమై వుండేది. ఈ అయిదేళ్ళ కాలంలోను దేశపు ప్రధాన ఉత్పత్తి ఆస్తులు దాదాపు 50 శాతం పెరిగాయి. జాతీయ ఆర్థిక వ్యవస్థలో పెట్టుబడులు మొత్తం 352 వేల మిలియన్ రూబుళ్ళు అయాయి (1969 ధరల ప్రకారం). ఇది గత 8 ఏళ్ళ

లోనూ పెట్టుబడి పెట్టిన మొత్తానికి దాదాపు సమానం. మన పెరుగుదల పరిమాణం ఈ విధంగా వుంది.

8వ పంచవర్ష ప్రణాళిక ననుసరించి అదనంగా 54 మిలియన్ కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేసే విద్యుత్ కేంద్రాలు పని ఆరంభించాయి. ప్రపంచంలోకల్లా పెద్దదైన జల విద్యుత్ కేంద్రం క్రాస్నోయార్స్క్ వద్ద నిర్మింపబడింది. అది 5 మిలియన్ కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేస్తుంది. 35,400 కిలోమీటర్ల పొడవుగల చమురు, ఖనిజ వాయు పైపు లైనులు వేయడం ఆరంభించబడింది.

ఇనుము, ఉక్కు పరిశ్రమలో సాలుకి 9.7 మిలియన్ టన్నుల దుక్క ఇనుమును 18 మిలియన్ టన్నుల ఉక్కును, 14.3 మిలియన్ టన్నుల ఉక్కు రేకులు, కడ్డీలు మొదలయిన వాటిని వుత్పత్తి చేయగల, 120.5 మిలియన్ టన్నుల ముడి యినుము తవ్వితీయగల పరిశ్రమలు పని ఆరంభించాయి. అయోరహిత లోహ పరిశ్రమలో రాగి, నిక్కెలు, తుత్తునాగము, అల్యూమినము లోహాలను ఉత్పత్తిచేసే ఫ్యాక్టరీలు గణనీయంగా పెంచబడ్డాయి. రసాయనిక పరిశ్రమలో 33 మిలియన్ టన్నుల రసాయనిక ఎరువులను ఉత్పత్తి చేయగల కర్మాగారాలు, కృత్రిమ దారాలను, రబ్బరును తయారుచేసే ఫ్యాక్టరీలు నిర్మింపబడ్డాయి. నిర్మాణ సామగ్రుల పరిశ్రమలో సిమెంటు ఫ్యాక్టరీలు, ఆస్‌బెస్టాస్‌ను తవ్వి తీయడానికి, శుద్ధి చేయడానికి పారిశ్రామిక సంస్థలు నిర్మించబడ్డాయి. తేలిక రకం పరిశ్రమలోనూ చాలా సంస్థలు పని ఆరంభించాయి.

ఆ పంచవర్ష ప్రణాళిక నెరవేర్చబడుతుండగానే దేశంలోకల్లా పెద్దదైన మోటారు పరిశ్రమను తోగ్లియాతి పట్టణంలో నిర్మించడానికి నిర్ణయం చేయబడింది. దాని నిర్మాణం 1967లో ప్రారంభించబడింది, 1970 ఆగస్టులోనే, ఆ వోల్గా కారు ఫ్యాక్టరీ మొదటి జట్టు ప్యాసింజరు కార్లను తయారు చేసి బైటికి పంపింది.

అదే సమయంలో, పరిశ్రమాదుల నిర్మాణంలో చాలా లోపాలు కూడా వున్నాయి. కొన్ని పారిశ్రామిక సంస్థల, యంత్రాల నిర్మాణ కాలవ్యవధులు సాధారణ ప్రమాణాలను బాగా దాటిపోయాయి. దాని మూలంగా ప్రతిఫలం లేని పెట్టుబడులు, నష్టాలూ ఏర్పడ్డాయి. పూర్తికాని నిర్మాణాలు యింకా చాలా వుండిపోయాయి.

సాంకేతిక పురోగమనమూ, ఉత్పత్తి వ్యవస్థీకరణలో వచ్చిన మెరుగుదల, కార్మికుల నైపుణ్యస్థాయిలు పెరగడం—ఇవన్నీ, *సామాజిక శ్రమయొక్క ఉత్పాదకశక్తి* పెరుగుదల వేగాన్ని హెచ్చు చేయడానికి తోడ్పడ్డాయి. జాతీయ ఆర్థిక వ్యవస్థలో మొత్తం మీద సామాజిక శ్రమయొక్క ఉత్పాదకశక్తి 37 శాతం పెరిగింది. 7వ పంచవర్ష ప్రణాళిక కాలంలో ఈ పెరుగుదల 29 శాతం. 7వ పంచవర్ష ప్రణాళిక కాలంలో పారిశ్రామిక ఉత్పత్తిలో వచ్చిన పెరుగుదలలో 62 శాతం శ్రమ ఉత్పాదకశక్తి ఎక్కువ కావడం మూలంగానే జరిగింది. ఎనిమిదవ పంచవర్ష ప్రణాళిక కాలంలో ఆ వంతు 73 శాతం,

1970లో అయితే 84 శాతం అయింది. పారిశ్రామిక, వ్యావసాయిక ఉత్పత్తిలో పెరుగుదల, శ్రామిక ఉత్పాదక శక్తిని పెంచటం ద్వారానే ఎక్కువగా కొనసాగాలి. సోషలిస్టు ఆర్థిక వ్యవస్థను అభివృద్ధిచేసే ప్రధాన మార్గం యిదే.

ఉత్పత్తి ఖర్చులను తగ్గించడంలో గమనించతగిన విజయాలే సాధించబడ్డాయి. ఈ అయిదేళ్ళలోనూ పారిశ్రామిక సంస్థల లాభాలు రెట్టింపుకు మించాయి. ఉత్పత్తియొక్క లాభదాయకత పెరిగింది.

మన ఆర్థిక వ్యవస్థాభివృద్ధి, సోవియట్ విజ్ఞాన శాస్త్రం సాధించిన ముఖ్య విజయాలతో సన్నిహితంగా ముడిపడి వుంది. కొత్తరకం యంత్రాలకు రూపకల్పన చేయడంలోనూ, కృత్రిమ పదార్థాలను, ఎలెక్ట్రానిక్ సాధనాలను తయారు చేయడంలోనూ శాస్త్రజ్ఞులు గొప్ప పాత్రను నిర్వహించవలసి వుంది. గణిత శాస్త్రం, పదార్థ విజ్ఞాన శాస్త్రం, రసాయన శాస్త్రం, భూగర్భ శాస్త్రం, జీవ శాస్త్రం, రోదసీ పరిశోధన రంగంలో గణనీయమైన శాస్త్రీయ విజయాలు సాధించబడ్డాయి.

దేశ రక్షణ పాటవాన్ని పటిష్టం చేయడం పట్లను, రక్షణ పరిశ్రమలను అభివృద్ధి చేయడం పట్లనూ, పార్టీ కేంద్ర కమిటీ, సోవియట్ ప్రభుత్వమూ నిరంతరం శ్రద్ధ వహించాయి, వహిస్తూనే వున్నాయి. ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితి దృష్ట్యాను, మనదేశ భద్రత దృష్ట్యానూ మనం ఆ పని చేయవలసి వస్తోంది. అధునాతనమైన శాస్త్ర, సాంకేతిక విజయాల ఆధారంగా చాలా కొత్తరకాల ఆధునిక ఆయుధాలు రూపొందించబడ్డాయి. అవి ఉత్పత్తి చేయబడుతున్నాయి. ఆయుధాల పాటవమూ, సాంకేతిక లక్షణాలూ మెరుగు పర్చబడ్డాయి. సోవియట్ సాయుధ దళాలకు అత్యుత్తమ శ్రేణికి చెందిన అధునాతన యుద్ధసామగ్రి సమకూర్చబడిందని ఈ మహాసభకు నివేదించగల స్థితిలో వున్నాము.

కామ్రేడ్స్! పార్టీ చేసిన కృషియొక్క విస్తృతీ, ఎనిమిదవ పంచవర్ష ప్రణాళికను నెరవేర్చడంవల్ల కలిగిన ఫలితాల ప్రాముఖ్యమూ అద్భుతమైనవి. కాని మన విజయాలను ఎక్కువ అంచనా వేసుకోకూడదు. పరిష్కృతం కాని సమస్యలు మనకింకా చాలా వున్నాయి. ఇబ్బందులూ, లోపాలూ కూడా వున్నాయి.

ప్రధాన సూచికలకు సంబంధించినంత వరకు పంచవర్ష ప్రణాళిక నెరవేర్చ బడింది. కాని, నిర్మాణ మంత్రిత్వశాఖలు తమ ప్రణాళికను పూర్తిగా నెరవేర్చలేదు. బొగ్గు తవ్వకంలోనూ, ఇనుము కలసిన లోహాల కడ్డీలు, రేకులు మొదలయిన వాటి ఉత్పత్తిలోనూ రసాయనిక దారాలు, ప్లాస్టిక్స్, లారీలు, ట్రాక్టర్లు, కాగితపు గుజ్జు, సిమెంటు ఉత్పత్తిలోనూ, తేలిక రకం పరిశ్రమల్లోనూ, ఆహార పరిశ్రమలోనూ, కొన్ని ప్రాజెక్టుల విషయంలోనూ పూర్తి సామర్థ్యంతో పని ఆరంభించబడలేదు. దీని మూలంగా కొన్ని రకాల సరకుల ఉత్పత్తి లక్ష్యాలు నెరవేర్చబడలేదు. పరిశ్రమలోనూ, వ్యవసాయంలోనూ ప్రత్యే

కించి నిర్మాణరంగంలో, శ్రామిక ఉత్పాదకశక్తి పెరుగుదల నిర్ణయించుకున్న లక్ష్యంకంటె కొంచం తక్కువగానే వుంది.

8వ పంచవర్ష ప్రణాళిక కాలంలో దేశ ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి ఉద్రిక్తమైన అంతర్జాతీయ పరిస్థితులలో కొనసాగిందనే విషయాన్ని విస్మరించకూడదు. దాని మూలంగా దేశ రక్షణ కోసం అదనపు చర్యలను అమలు జరపవలసిన అవసరం ఏర్పడింది. అందుకోసం మన వనరులు, మనుష్యశక్తి కొంత దానికి మళ్ళించవలసి వచ్చింది.

అదే సమయంలో మనలో చాలా లోపాలు కూడా వున్నాయి. వాటికి కారణాలను కేవలం బాహ్యమైనవిగా పరిగణించడానికి వీులేదు. 1969 డిసెంబరులో జరిగిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ విస్తృత సమావేశంలో ఈ లోపాలు అందరి దృష్టికీ తీసుకు రాబడ్డాయి. ఆర్థిక రంగంలోని కొందరు అధికారులు ప్రభుత్వ క్రమశిక్షణను ఉల్లంఘించారని, పథకాలు నెరవేర్చక పోవడం, సహకారంతో జరిగే సరకుల సప్లయిలలో పెట్టుకున్న లక్ష్యాలు నెరవేర్చక పోవడం, ప్రజల పట్ల తమకున్న బాధ్యతను సరిగా గుర్తించక పోవడం లాంటి తప్పులు చేశారని, కేంద్ర కమిటీ విమర్శించింది.

ఈ పార్టీ మహాసభకు ముందు జరిగిన యూనియన్ రిపబ్లిక్‌ల కమ్యూనిస్టు పార్టీల సమావేశాలూ, మహాసభలూ, ఆర్థిక సంస్థలయొక్క, మంత్రిత్వ శాఖలయొక్క, డిపార్టుమెంటులయొక్క కార్యకలాపాలను విమర్శనా దృష్టితో పరిశీలించాయి. ఆధునిక సాంకేతిక ప్రమాణాలను అందుకొనకుండా వున్న, యంత్ర పరికరాలను తయారు చేసే కొన్ని ఇంజనీరింగు సంస్థల మీదనూ, వ్యవసాయ యంత్రాలను, పారిశ్రామిక యంత్రాలను తయారు చేసే సంస్థల మీదనూ, ప్రత్యేకించి ఫౌండ్రీ పరికరాలను తయారుచేసే పరిశ్రమ మీదనూ న్యాయమైన విమర్శనలే చేయబడ్డాయి. తేలికరకం పరిశ్రమ, మేలురకం దుస్తులకు, అల్లిక సరకులకు, పాదరక్షలకు, మరికొన్ని యితర సరకులకు సంబంధించిన ప్రజల అవసరాలను ఇంకా తీర్చవలసివుంది. పాత వాటి స్థానంలో కొత్త రకం సరకులను తయారు చేయటం చాలా మెల్లగా జరుగుతోంది. ముడి పదార్థాలు అప్పుడప్పుడు తగినంత హేతుబద్ధంగా ఉపయోగింపబడటం లేదు. కొత్తగా ఉత్పత్తి చేయబడే సరకుల మొదటి కొద్ది వరుసలు మాత్రం మంచి నాణ్యత గలవిగా వుండటమూ, ఆ తరువాత వాటి నాణ్యత తగ్గిపోవడమూ తరచు సంభవించింది. ఆధునిక యంత్రాలు సమకూర్చబడిన కొత్త పారిశ్రామిక సంస్థలు సహితం ఒక్కొకప్పుడు వాడుకలో లేకుండా పోతున్న రకాల సరకులను తయారు చేశాయి. పరిశ్రమల్లో ప్రధాన ఉత్పత్తి ఆస్తులను వినియోగించుకోడంలో చాలా లోపాలు జరిగాయి. కొత్తగా కల్పించబడిన ఉత్పత్తి సదుపాయాలను వాటికున్న ఉత్పాదక స్థాయిలను చేరుకునేటట్లు చేయడంలో ఆలస్యం జరిగింది.

ఆహార, మత్స్య పరిశ్రమలలోనూ, మాంసము, పాడి పరిశ్రమలలోనూ ముడి పదార్థాలు బాగా నష్టపోవడం, సాంకేతిక ప్రమాణాలను పాటించక పోవడం సంభవించాయి.

దీనివల్ల సరకుల నాణ్యత దెబ్బ తింది. సరకుల రకాలను పెంచడం పట్ల తక్కువ శ్రద్ధ వహించబడింది. తేలిక రకం పరిశ్రమలోని, ఆహార పరిశ్రమలోని సంస్థలకూ, ప్రజోపయోగాలకూ అధునాతమైనవీ, అధిక ఉత్పాదకశక్తి గలవీ అయిన, పరికరాలను తగినంత మొత్తాలలో సరఫరా చేయడంలో ఇంజనీరింగు మంత్రిత్వ శాఖలు విఫలమయ్యాయి. సోవియట్ దేశ కలప, కొయ్యపనుల పరిశ్రమల మంత్రిత్వ శాఖ, కాగితం గుజ్జు, కాగితం పరిశ్రమల మంత్రిత్వశాఖ, ఫర్నిచరు ఉత్పత్తిని, కాగితం, అట్టల ఉత్పత్తిని పెంచే కర్తవ్యాన్ని నిర్వహించలేక పోయాయి. ఫర్నిచరుయొక్క నాణ్యత అన్ని సందర్భాలలోనూ వాడకం దార్లను సంతృప్తిపరచలేక పోయింది. పింగాణి సామానులను, చాలా గృహోపకరణ వస్తువులను అమ్మకానికి పెట్టడంలో అంతరాయాలు కలిగాయి.

మంచి పేరుప్రఖ్యాతులను పొందిన సరకులను తయారు చేసే చాలా ఫ్యాక్టరీలను గురించి వేరే చెప్పనక్కర లేదు. తేలిక రకం పరిశ్రమలోనూ, ఆహార పరిశ్రమలోనూ నౌకా నిర్మాణ, ఎలక్ట్రానిక్సు, విమానాలు, రక్షణ పరిశ్రమలలోనూ, పరికరాల తయారీ, రేడియో పరిశ్రమలలోనూ చాలా సంస్థలు మంచి వాడకం సరకులను తయారు చేశాయి. ఎలాంటి మినహాయింపు లేకుండా పారిశ్రామిక సంస్థలన్నీ అదే విధంగా చేసేటట్లు చూడటం మన కర్తవ్యం. అవి తయారు చేసే సరకులన్నీ మంచి నాణ్యత గలవిగా వుండేటట్లు, అధికమైన ప్రజల అవసరాలను తీర్చేటట్లు చేయడం మన కర్తవ్యం.

ప్రతి నిర్వహణాధికారీ ప్రజలపట్ల అత్యంత బాధ్యతాయుత భావం కలిగివుండాలని, ఆర్థిక కర్తవ్యాలను నెరవేర్చడంలో దేశ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకోవాలని, సిబ్బందియొక్క పని పరిస్థితులను మెరుగుపర్చడం పట్ల నిరంతర శ్రద్ధను ప్రదర్శించాలని, సోషలిస్టు క్రమశిక్షణ స్థాయిని పెంచడానికి నిత్యమూ పట్టుదలతో కృషి చేయాలని, శ్రమ శక్తిని, ఉత్పత్తిని, మేనేజిమెంటునూ హేతుయుక్తమైన పద్ధతులలో వ్యవస్థీకరించాలనీ, విజ్ఞాన శాస్త్రమూ, సాంకేతిక శాస్త్రమూ సాధించిన విజయాలను ఉత్పత్తి రంగంలో త్వర త్వరగా ఉపయోగంలో పెట్టాలనీ పార్టీ కోరుతోంది.

మొత్తంగా ఫలితాన్ని సమీక్షిస్తే నిర్భయంగా ఈ విధంగా చెప్పవచ్చు: రాజకీయ, ఆర్థిక, సామాజిక రంగాల్లో మనదేశం కమ్యూనిస్టు నిర్మాణ మార్గంలో విజయవంతంగా ముందుకు నడుస్తోంది.

ఎనిమిదవ పంచవర్ష ప్రణాళిక కాలంలో మనం సాధించిన విజయాలన్నీ కూడ, కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం క్రింద సోవియట్ ప్రజలు జరిపిన మహత్తరమైన సృజనాత్మక కృషి ఫలితాలే.

గత అయిదేళ్ళ కాలంలోనూ సోవియట్ ప్రజలు శ్రమించి పని చేయడంలో సాధించిన అద్భుత కృత్యం కమ్యూనిస్టు నిర్మాణ చరిత్రలో మరొక ఉజ్వలమైన పుటగా నిలిచిపోతుంది

# II

# తొమ్మిదో పంచవర్ష ప్రణాళిక యొక్క సామాజిక-ఆర్థిక మూల కర్తవ్యాలు

క్రాప్రేడ్స్, ముసాయిదా ఆదేశాలు పార్టీ యొక్క ఆర్థిక విధానాన్ని అమలు జరిపేందుకూ, సోషలిస్టు సమాజం యొక్క ప్రస్తుత అభివృద్ధి దశకు సంబంధించిన కీలకము లయిన సామాజిక - ఆర్థిక సమస్యలను పరిష్కరించేందుకూ ఒక కార్యక్రమం.

కమ్యూనిజం మార్గంలో సోవియట్ సమాజం యింకా పురోగమించడంలోనూ, దానియొక్క పాదార్థిక, సాంకేతిక పునాదిని నిర్మించడంలోనూ, దేశం యొక్క ఆర్థిక, రక్షణశక్తిని బలపరచడంలోనూ తొమ్మిదో పంచవర్ష ప్రణాళిక ఒక ముఖ్యమైన ఘట్టంగా వుంటుంది. *సోషలిస్టు ఉత్పత్తిని అధిక వేగంతో వృద్ధి పొందించడం ద్వారానూ, దాని సామర్థ్యాన్నీ, శాస్త్ర, సాంకేతిక పురోగతిని హెచ్చించడం ద్వారానూ, శ్రామిక ఉత్పాదకశక్తి పెరుగుదలను త్వరితపరచడం ద్వారానూ ప్రజల పాదార్థిక. సాంస్కృతిక స్థాయిని బాగా పెరిగేటట్టు చేయడం పంచ వర్ష ప్రణాళిక ప్రధాన కర్తవ్యం.*

సోషలిస్టు ఉత్పత్తిలో యింతవరకూ వచ్చిన మొత్తం అభివృద్ధివలన కలిగిన వాస్తవావకాశాలనూ, మన సోషలిస్టు ఆర్థికవ్యవస్థ వనరుల పెరుగుదలనూ—మన జాతీయాదాయంలో యిది వ్యక్తం అవుతూంది—దృష్టిలో పెట్టుకొనే పార్టీ, ప్రజా జీవితంలో పాదార్థిక, సాంస్కృతిక స్థాయిని బాగా పెంచాలనే కర్తవ్యాన్ని ప్రతిపాదించింది.

ఎనిమిదవ పంచవర్ష ప్రణాళిక కాలంలో సాలుసరి సగటు జాతీయదాయం 233,000 మిలియన్ల రూబుళ్ళు వుండగా, తొమ్మిదవ పంచవర్ష ప్రణాళిక కాలంలో అది 325,000 మిలియన్ల రూబుళ్ళు అవుతుంది. ఆ ఐదేళ్ళకీ మొత్తం జాతీయాదాయం 1625,000 మిలియన్ల రూబుళ్ళు వుంటుంది. తొమ్మిదో ప్రణాళిక కర్తవ్యాలను పూర్తి చేయడానికి ఉన్న పాదార్థిక పునాది అది.

మన ప్రజలే తమ జాతీయాదాయాని కంతకూ యజమానులు. పెట్టుబడిదారీ సమాజ వ్యవస్థలో స్వతస్సిద్ధంగా వుండే, నిధుల పోగు కావడానికీ, వినియోగం కావడానికీ మధ్య వైరుధ్యం సోషలిస్టు సమాజంలో వుండదు: ఈ దేశంలో ఆ రెండూ కూడ ప్రజలు యావన్మంది ప్రయోజనాలకై పూర్తిగా వినియోగించ బడుతున్నాయి.

సోషలిస్టు జాతీయ ఆర్థికవ్యవస్థ సమతూకం కలిగి పెంపొందాలంటే జాతీయాదాయం యొక్క పంపిణీలోని నిష్పత్తులను మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాన్ని మార్గదర్శకంగా పెట్టుకొని శాస్త్రీయ పద్ధతిలో నిర్ణయించాల్సి వుంటుంది: ఇంతవరకు సాధించిన ఉత్పత్తి స్థాయిని, ప్రజల జీవన స్థాయిని, అంతర్జాతీయ పరిస్థితిని, ఆర్థికాభి

వృద్ధి కర్తవ్యాలనూ, అవకాశాలనూ, ఈ అన్ని విషయాలనూ సర్వతోముఖంగా ఆలోచించ వలసి వుంటుంది.

కమ్యూనిస్టు నిర్మాణం యొక్క కర్తవ్యాలూ, పరిస్థితులూ దృష్ట్యా నూతన పంచవర్ష ప్రణాళిక యొక్క ప్రధాన లక్షణాలు, దిగువ చెప్పినవి—ఏర్పడుతున్నాయి. అవన్నీ కూడ అంగాంగిక సంబంధం కలిగివున్న వే:

మొదటిది - జాతీయార్థిక వ్యవస్థను, ప్రజల సంక్షేమాన్నీ, వారి పని పరిస్థితులనూ, జీవిత పరిస్థితులనూ మెరుగు పరచేందుకై యింకా చాల హెచ్చుగా వినియోగించాలి. ప్రజా సంక్షేమాన్ని పెంపొందించేందుకు ప్రభుత్వం కేటాయించే వనరుల్ని బాగా హెచ్చించడం గత పంచవర్ష ప్రణాళికల కాలంలోనూ, ఇప్పటి దాంట్లోనూ కూడ ఉన్న లక్షణం. ఎనిమిదో పంచవర్ష ప్రణాళికలో ఈ వనరులు పెరిగి 57,000 మిలియన్ల రూబుళ్లు అయ్యాయి. ఈ తొమ్మిదవ పంచవర్ష కాలంలో అది 75-81 వేల మిలియన్ల రూబుళ్ళు కావాలన్నది ప్రణాళికలోని లక్ష్యం;

రెండోది - శాస్త్ర, సాంకేతిక అభివృద్ధి బాగా వేగవంతం కావడం మూలంగా సామాజిక ఉత్పత్తినీ, దాని సామర్థ్యాన్నీ అంతనూ అత్యధికంగా హెచ్చించాలి. ఉత్పత్తి స్వరూపాన్ని బాగా మెరుగు పరచడం, సాంకేతికంగా లోప రహితమైన యంత్రాలను, పరికరాలను, నూతన పదార్థాలను తయారుచేయడం, ఉత్పత్తి చేసే వస్తువుల వైవిధ్యాన్ని పెంచడం ద్వారా దీనిని సాధించాలి.

తొమ్మిదవ పంచవర్ష ప్రణాళికలో సామాజికోత్పత్తి పెంపుదలకు కీలకమైన దిగువ సూచికలను ముసాయిదా ఆదేశాలు నిర్దేశిస్తూ వున్నవి:

| | 1970 | 1975 | అయిదేళ్ళలో పెరుగుదలలు 1966-70 | 1971-1975 |
|---|---|---|---|---|
| జాతీయాదాయం (సాపేక్ష ధరలలో) వేల మిలియన్‌ల రూబుళ్ళు | 266.3 | 365-373 | 77.2 | 99-107 |
| దానిలో: | | | | |
| ప్రజా వినిమయ నిధి | 197.2 | 272-278 | 56.8 | 75- 81 |
| పోగుపడే నిధి | 69.1 | 93-95 | 20.4 | 24- 26 |
| పారిశ్రామికోత్పత్తి (సాపేక్ష ధరలలో) (వేల మిలియన్ రూబుళ్ళు) | 373 | 528-544 | 125 | 155-171 |
| వ్యవసాయోత్పత్తి (సాపేక్ష ధరలలో- అయిదేళ్ళకాలంలో సగటు సాలుసరి వుత్పత్తుల ధర) వేల మిలియన్ల రూబుళ్లు | 80.3 | 96.98 | 14 | 15.7-17.7 |
| శ్రామిక వుత్పాదకశక్తి పెరుగుదల శాతాలు: | | | | |
| పరిశ్రమలలో | — | — | 32 | 36-40 |
| వ్యవసాయంలో(సమిష్టి,ప్రభుత్వక్షేత్రాలలో) | — | — | 35 | 37-40 |
| నిర్మాణంలో | — | — | 22 | 36-40 |

నూతన పంచవర్ష ప్రణాళిక కాలంలో యావత్తు జాతీయార్థిక వ్యవస్థ పెరుగుదల అధిక వేగంతో సాగాలి. ఆ ఐదేళ్ళలో జాతీయాదాయం 37-40 శాతం, పారిశ్రామికోత్పత్తి 42-46 శాతం, సాలుసరి సగటు వ్యవసాయోత్పత్తి 20-22 శాతం పెరగాలి.

ఈ ఐదేళ్ళలోనూ ఉత్పత్తి సాధనాల ఉత్పత్తి 41-45 శాతమూ, వాడకం వస్తువుల ఉత్పత్తి 44-48 శాతమూ పెరగడానికి ఏర్పాట్లు చేయబడినాయి.

వ్యవసాయాభివృద్ధికి మార్గాలను నిర్దేశించిన, 1970 జూలై సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ విస్తృత సమావేశం నిర్ణయించిన లక్ష్యాలను ముసాయిదా ఆదేశాలు పూర్తి గమనికలో పెట్టుకొన్నాయి.

వ్యవసాయాభివృద్ధికీ, ప్రజలకోసం వస్తువులను ఉత్పత్తిచేసే విభాగాల అభివృద్ధికీ ప్రస్తుత పంచవర్ష ప్రణాళిక కాలంలో కేటాయించినంత అధికంగా ధన, పాదార్థిక వనరులను మరెప్పుడూ కేటాయించడం జరగలేదని నొక్కి చెప్పాలి. ఇది త్వరలోనే ఫలితాలనిస్తుంది. పట్టణాలూ, పల్లెలలో ప్రజల జీవన స్థాయిని యింకా హెచ్చు చేయడంలో దాని ప్రభావం విస్పష్టంగా వుంటుంది.

సోవియట్ యూనియన్ మహా శక్తివంతమైన సోషలిస్టు దేశం. ప్రపంచ వ్యాప్తంగా సాగుతున్న శాస్త్ర, సాంకేతిక విప్లవానికి అది నాయకమణి.

సామాజికోత్పత్తి మీద శాస్త్ర, సాంకేతిక విప్లవం అధికాధిక ప్రభావం కలిగిస్తోంది. ఆ విప్లవ విజయాలను అమలులోకి పెట్టేటందుకు తొమ్మిదో పంచవర్ష ప్రణాళికా కాలంలో ఒక పెద్ద ప్రయత్నం చేయబడుతుంది. శాస్త్ర సాంకేతిక విప్లవం వలన ఉత్పత్తి పద్ధతులలో పెద్ద మార్పు రావడానికీ, పూర్తిగా కొత్తవయిన, అత్యధికంగా ఉత్పత్తి చేయగల శ్రమ సాధనాలనూ, చాల అభివృద్ధి చెందిన పదార్థాలనూ పెంపొందించేందుకూ అవకాశాలు కలుగుతాయి. కొత్త పరిశ్రమలను విస్తరింప చేస్తుంది. మొత్తం;ఉత్పత్తి కార్యకలాపా లన్నిటి సామర్థ్యాన్ని పెంపొందించేందుకు యిదివరకెన్నడూ లేని అవకాశాలు కలిగిస్తుంది.

పెట్టుబడిదారీ దేశాలలో బూర్జువా వర్గం, ఆ విప్లవ విజయాలను తన వర్గ ప్రయోజనాలను సాధించుకొనేందుకు వుపయోగిస్తోంది. కాని పెట్టుబడిదారీ విధానంలో అంతర్గతంగా ఉన్న వైరుధ్యాలను, శాస్త్ర - సాంకేతిక విప్లవం తీవ్రపరుస్తోంది. ఉదాహరణకు అమెరికాలో శ్రమ ఉత్పాదకత పెరుగుదల వేగవంతం కావడమూ, నిరుద్యోగం పెరుగుదలా రెండూ చెట్టా పట్టాలు వేసుకొని సాగుతున్నాయి; కర్మాగారాల నుంచీ, ఫ్యాక్టరీల నుంచీ మిలియన్ల కొలది శ్రామిక ప్రజలు తొలగించి వేయబడ్డారు.

వర్గ వైరుధ్యాలు తీవ్రం కావడాన్ని, సమ్మె ఉద్యమం క్రమాధికం కావడం బట్టి కూడా చూడవచ్చు. 1961-65 సంవత్సరాలలో సమ్మెల వలన 97 మిలియన్ల పని రోజులు

నష్టమైతే, 1966-71 లో 220 మిలియన్ల పని రోజులు నష్టమయాయని, అమెరికా కార్మిక శాఖ ప్రకటించిన సాధికార సమాచారం వలన తెలుస్తూంది.

శాస్త్ర - సాంకేతికాభివృద్ధికి అనంతావకాశాలు కలిగించగలది, సోషలిస్టు వ్యవస్థ ఒక్కటి మాత్రమే. పెట్టుబడిదారీ ఆర్థికవ్యవస్థలా గాక, సోషలిస్టు ఉత్పత్తి యొక్క సుస్థిరమూ, అధికమూనైన పెరుగుదల వేగం, శ్రమ ఉత్పాదకత వేగంగా పెరగడంతో పాటు సోవియట్ ప్రజలకు పూర్తి ఉద్యోగాన్ని కూడా కలిగిస్తూంది.

ఒక్క సోషలిజం ద్వారా మాత్రమే, మన సామాజిక వ్యవస్థ పరిధిలో మాత్రమే, శాస్త్ర, సాంకేతిక విప్లవం పూర్తిగా, సమగ్రంగా వృద్ధి పొంద గలుగుతుంది. దాని ఫలితాలు శ్రామిక ప్రజలకు చెందుతాయి.

సాంకేతిక పురోగతిని నిర్ణయించే విభాగాలలో పెరుగుదల వేగానికి ముసాయిదా ఆదేశాలు సర్వ ప్రాధాన్యం యిస్తున్నాయి. వచ్చే ఐదేళ్ళలో విద్యుచ్ఛక్తి, రసాయనాలు, పెట్రో రసాయనాలు, ఇంజినియరింగ్, పరికర నిర్మాణం, స్వయంచాలన సాధనాల ఉత్పత్తి, కంప్యూటర్లు, శ్రమ అధికంగా అవసరమయ్యే పనులను యాంత్రికం చేయడానికి అవసరపడే సాధన సామగ్రి మొదలయిన పరిశ్రమలలో మొత్తంమీద ఉత్పత్తి 67 శాతం పెరగవలసి వుంది.

శాస్త్ర, సాంకేతిక విప్లవంలో ఉన్న అవకాశాలను ఉపయోగించు కోవాలంటే అధికాధికంగా మూలధనం పెట్టవలసి వుంటుంది. అయితే దాని అభివృద్ధి దశ ప్రతి ఒక్కదానిలోనూ, అందుకోసం ఉపయోగించేటందుకు నిర్దిష్టములయిన వనరులు ప్రభుత్వం వద్ద వున్నాయి. అందుకే, శాస్త్ర సాంకేతికాభివృద్ధి యొక్క ప్రధాన రంగాలను ఎన్నిక చేసుకోవడమూ, అభివృద్ధి పరచడంలో ప్రత్యేక స్థానం యివ్వడమూను. ప్రభుత్వం ఒకే మాదిరి సాంకేతిక విధానాన్ని రూపొందించి, నికరంగా అమలు జరుగుతున్నది అందుకే. ఈ విధానం యొక్క మూల కర్తవ్యాలను ముసాయిదా ఆదేశాల్లో పొందు పరచారు.

గుణాత్మకంగా నవ్యములైన శ్రమ పరికరాలనూ, నూతన పదార్థాలనూ, మెరుగు పరచిన సాంకేతిక పద్ధతులనూ పెంపొందించడం ప్రప్రథమ కర్తవ్యం. ప్రస్తుతపు అలవాట్లతో కాలం వెళ్ళబుచ్చడం గాక, ప్రపంచంలో కల్లా ఉత్తమములైన ప్రమాణాలను మించిపోగల స్థాయిని లక్ష్యంగా పెట్టుకోడం అవసరం. కమ్యూనిజానికి పాదార్థిక, సాంకేతిక పునాది నిర్మించేందుకై అవసరమైన వానిని సమకూర్చగల యంత్రాంగాన్ని సృష్టించాలన్నా, పెట్టుబడిదారీ విధానంతో ఆర్థిక పోటీలో పూర్తి విజయం సాధించాలన్నా అదొక్కటే మార్గం.

పాతబడిన యంత్రాంగాలను మార్చివేసి కొత్త వానిని వేగంగా నిర్మించడం రెండో కర్తవ్యం. 1975 నాటికి ఈ ఐదేళ్ళలోనూ పనిలోకి తెచ్చిన కొత్త ఉత్పాదక సంపదలు పరిశ్రమలో 46 శాతం, వ్యవసాయంలో 60 శాతం వుంటాయి. ఇది ఉత్పత్తి

యొక్క సాంకేతిక స్థాయిని బాగా ఎక్కువ చేస్తుంది. జాతీయార్థిక వ్యవస్థ విభాగాలన్నింటా సాగుతున్న సోషలిస్టు పోటీ ఫలితాల మాదిరిగానే మంత్రిత్వ శాఖలూ, పరిశ్రమలూ యొక్క పనిని విలువ కట్టడంలో కొత్త యంత్రాలకు సంబంధించిన పథకాలు పూర్తి కావడం ఒక ముఖ్యమైన కొలబద్ద కావాలి.

శ్రమ ఎక్కువ అవసరమయ్యే పనులను విశేషంగా యంత్రపరం చేయడం ప్రధాన కర్తవ్యాలలో ఒకటి. శరీర శ్రమ స్థానే యంత్రాలను అత్యధికంగా ప్రవేశ పెట్టడం సాధ్యమయ్యేటట్లు చేయడానికి యిది అవసరం. పరిశ్రమలలో, భవన నిర్మాణంలో, వ్యవసాయంలో, రవాణాలో ప్రధానములైన ఉత్పత్తి క్రమాలలో యంత్రాలను ప్రవేశపెట్టడం పూర్తి అయిపోవాలి. యంత్రాలతోనే పని జరిగిపోయే పద్ధతులకు రూపకల్పన చేయడం, స్వయంచాలక మేనేజిమెంటు పద్ధతులను విస్తృతంగా ప్రవేశ పెట్టడమూ ముఖ్యం.

జాతీయార్థిక వ్యవస్థలో రసాయనికోపయోగం యొక్క విస్తృతి, ముఖ్య పరిశ్రమ శాఖలలోనూ, వ్యవసాయంలోనూ రసాయనికోత్పత్తుల్నీ, వస్తువుల్నీ ఉపయోగించడమూ, రసాయన సాంకేతిక ప్రక్రియల్ని ప్రవేశపెట్టడమూ సాధ్యమయినంత ఎక్కువగా జరగాలి. సామాజికోత్పత్తి యొక్క సామర్థ్యాన్ని పెంపొందించడానికి యిది అత్యంత ముఖ్యం.

మూల ఉత్పత్తిరంగాన్నే గాక, దానికి సహాయకరంగా, తోడ్పాటుగా ఉండే ఉత్పత్తి రంగాలను కూడా అభివృద్ధి పొందించేందుకు సమగ్ర రూపంలో ఆలోచించాలి. ఉత్పత్తి పరిమాణం నిరంతరం పెరుగుతుండడానికీ, ఉత్పత్తి సామర్థ్యాన్ని గరిష్ఠ పరిమితికి హెచ్చించవలసిన బాధ్యతలకూ యివి అవసరం. నిలవ సౌకర్యాలు, బంగీ కట్టే ఏర్పాట్లూ వంటి రంగాలను కూడా విస్మరించరాదు. ఉత్పత్తిని సురక్షితంగా వుంచడం, ముడి సరుకులు మొదలైన వానినీ, పూర్తి అయిన వస్తువుల్నీ పొదుపు చేయడమూ, వాటి మంచి చెడ్డలమీద ఆధారపడి వుంటాయి.

లాభ నష్టాల లెక్కలకు సంబంధించిన ఏర్పాట్లు, ముఖ్యంగా ఉత్పత్తులకు ఆర్థికంగా న్యాయమయిన ధరలు పెట్టడం, పరిశ్రమలకు ధన సహాయం, రుణ సహాయమూ చేసే పద్ధతులూ—తప్పకుండా సాంకేతికాభివృద్ధిని త్వరిత పరచేందుకు తోడ్పడాలి.

సాంకేతిక, ఆర్థిక, సామాజికాభ్యుదయాన్ని త్వరిత పరచడంలో మన విజ్ఞాన శాస్త్రాలు ఎంతో పాత్ర నిర్వహించవలసి వుంది. పరిశోధనలు మొదలుకొని, వాని ఫలితాలను ఉత్పత్తిలో అనువర్తింప చేయడం వరకూ గల బహుళ క్రియల్ని, వేగంగా అమలు పెట్టగలిగితే అవి తమ పాత్రను విజయవంతంగా నెరవేర్చ గలుగుతాయి.

మన దేశం యొక్క ఆర్థిక, రక్షణ పటిష్ఠతను పెంపొందించడంలో మన శాస్త్రవేత్తలు చేసిన సహాయాన్ని మనం ఎంతో అభినందిస్తున్నాము. శాస్త్ర కృషిని ఫల

వంతంగా సాగించేటందుకు మన శాస్త్రవేత్తలకు—పరిశీలకులకూ, సిద్ధాంతవేత్తలకూ— కావలసినవన్నీ వున్నాయి.

కాని, మన పరిశోధన ఫలితాలు ఎల్లప్పుడూ మనకు తృప్తి నివ్వడం లేదు. కొన్ని పరిషత్తులూ, ప్రత్యేక విభాగ విద్యా సంస్థలూ, ఉన్నత విద్యా సంస్థలూ సాగిస్తున్న పరిశోధనలు శాస్త్ర, సాంకేతికాభివృద్ధికి సంబంధించిన కీలక సమస్యల పరిష్కారానికి చాలడంలేదు.

పరిశోధన సామర్థ్యాన్ని యింకా ఎక్కువ చేయడం మన శాస్త్రవేత్తల సృజనాత్మక కృషిమీద ఆధారపడ వుంటుంది. శాస్త్ర సాంకేతికాభివృద్ధికి ప్రతి ఒక్కరూ ఎంతెంతగా తోడ్పడ్డారో బాగా లెక్కలోకి తీసుకొనేటందుకై శాస్త్రవేత్తలకు ప్రతిఫలం యిచ్చే పద్ధతి మెరుగు కావలసి వుంది. ఇందువలన శాస్త్రవేత్త లయిన సిబ్బంది యొక్క పరిస్థితి మెరుగవుతుంది. పరిశోధనలను అధిక ఫలవంతం చేస్తుంది. శాస్త్రానికీ, ఉత్పత్తికీ మధ్య గల సంబంధాలు దృఢపడడంలో సంయుక్త ఉత్పత్తి సంస్థలు పెద్ద పాత్ర నిర్వహించాలి. వీటిలో ప్రయుక్త శాస్త్ర పరిశోధనలకు పథకాలు వేసుకోడమూ, వానిని నిర్వహించడమూ, రూపకల్పనమూ, ప్రయోగ ప్రక్రియలూ కేంద్రీకరించ బడడం సముచితం. అప్పుడు శాస్త్ర పరిశోధన ఫలితాలను వేగంగా ఉపయోగించుకోవడం జరుగుతుంది.

ఉత్పత్తిని బాగా ఎక్కువ చేయడానికై పార్టీ ఎత్తుకొన్న పంథా సామాజిక ఉత్పాదకతను బాగా హెచ్చించవలసిన అవసరాన్ని కలిగిస్తూంది; ముడి వస్తువులనూ, ఇతర వస్తువులనూ, పొదుపుగా వాడవలసిన అవసరాన్ని, ఉత్పత్తి ఆస్తులను మంచిగా ఉపయోగించ వలసిన అవసరాన్ని కలిగిస్తూంది; కొత్త యంత్రాలను ప్రవేశపెట్టడం, ఉత్పత్తిని శాస్త్రీయంగా వ్యవస్థీకరించడం, జాతీయార్థిక వ్యవస్థను నిర్వహించే పద్ధతులను మెరుగు పరచడం ఆవశ్యకం చేస్తూంది.

తొమ్మిదో పంచవర్ష ప్రణాళిక కాలంలో *పరిశ్రమలలో శ్రమ ఉత్పాదకతను* 36-40 శాతం పెంచడానికి నిర్ణయించబడింది. గత పంచవర్ష కాలంలో దాని పెరుగుదల 32 శాతం. 1966-70 సంవత్సరాలలో సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో శ్రమ ఉత్పాదకత పెరుగుదల 35 శాతం ఉంటే, ప్రస్తుత పంచవర్ష కాలంలో 37-40 శాతం పెంచాల్సి వుంది. గత పంచవర్ష కాలంలో నిర్మాణ పరిశ్రమలో, శ్రమ ఉత్పాదకత పెరుగుదల 22 శాతం ఉంటే, యిప్పుడు 36-40 శాతం పెరుగుతుంది. ఈ లక్ష్యాలు మన ఆర్థికాభివృద్ధి కార్యక్రమాని కంతకూ, అత్యంత ప్రధానం. శ్రమ ఉత్పాదకత పెరుగుదలమీద జీవన స్థాయి పెరుగుదల ప్రత్యక్షంగా ఆధారపడి వుంటుంది. తొమ్మిదో పంచవర్ష ప్రణాళిక కాలంలో అధిక శ్రమ ఉత్పాదకత ద్వారా మొత్తం జాతీయాదాయాన్ని 80-85 శాతం పెంచవలసి వుంది.

శ్రమ ఉత్పాదకత పెరుగుదల వేగానికి పెట్టుకొన్న లక్ష్యాలు పూర్తిగా వాస్తవిక

మైనవి. ఉత్పత్తికి సంబంధించిన సాంకేతిక పరికరాల స్థాయి పెరుగుదల వానిని పూర్తి చేయడం సాధ్యం చేస్తుంది.

శ్రమను యాంత్రికం చేయడంతో పాటు ఉత్పత్తి, శ్రమల వ్యవస్థీకరణను క్రమబద్ధంగా మెరుగు పరచాలి. పనిలో అభివృద్ధిపొందిన మార్గాలను వ్యాపింపచెయ్యాలి. పని సమయం నష్టాలను బాగా తగ్గించాలి. కొన్ని పారిశ్రామిక సంస్థలలో మొత్తం పని కాలంలో 15-20 శాతం షిఫ్టుల లోపల వ్యర్థంగా గడిచి పోతూండడాన్ని మనం ఒప్పుకో లేము. అనుబంధ క్రియల నిర్మాణం మెరుగు పరచడానికి ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలి, ముఖ్యంగా వస్తువులను తేవడం, తీసుకుపోవడంలో చాలమంది పనివారిని తప్పించి, వారిని ప్రధానమైన ఉత్పత్తి క్రమంలో వినియోగించవచ్చు.

ఇది చాలా ముఖ్యం. ఏమంటే, అందరికీ ఉద్యోగాలు ఉండడంచేత, మనం పని వారి సంఖ్యను పెంచి, ఉత్పత్తిని బాగా హెచ్చు చెయ్యడం జరిగే పనికాదు. మరొకటి కూడా మనస్సులో వుంచుకోవాలి. కొత్త పంచవర్ష కాలంలో, బాగా ఎక్కువ మంది పనివారిని సాంస్కృతిక రంగంలోకి, ప్రజల నిత్యావసర రంగాలలోకి మళ్ళించడం జరుగుతుంది.

కార్మికులకూ, ఆఫీసు పనివారికీ పని పరిస్థితులనూ, కార్మిక పరి రక్షణనూ ఇంకా మెరుగుపరచ వలసిన అవసరం వుంది. కార్మిక క్షేమం, కార్మిక భద్రతకు సంబంధించిన ఆధునిక పరికరాలను ఉత్పత్తిచేసే సామర్థ్యాన్ని తగినంతగా చేకూర్చుకోవాలి.

*సరకుల ఉత్పత్తిలో పదార్థాల అధిక వినియోగాన్ని తగ్గించేందుకు* పెద్దగానే చర్యలు తీసుకోవలసి వుంది. ఇది మన ఆర్థిక వ్యవస్థకు అనంతమైన నిధి వంటిది. దీని నింకా సరిగ్గా ఉపయోగించడం జరగడంలేదు.

ఇంధనాలూ, ముడి ఖనిజాలు, అత్యధికంగా తవ్వి తీయాలంటే చాలా ధనం మదుపు పెట్టాలి. అందుచేత నే ముడి పదార్థాలనూ, ఇతర పదార్థాలనూ పొదుపు చేయడం వలన ఉత్పత్తి ఖర్చులను తగ్గించడం సాధ్యం అవుతుంది. కావలసి వచ్చే జనం, ధనం మదుపులను బాగా తగ్గించ గలుగుతాము. మన ఉత్పత్తి పరిమితిని పట్టి చూస్తే పొదుపు చేయగల ముడి పదార్థాలూ, ఇతర పదార్థాలూ అనంతమైన అదనపు నిధులే కాగలవు.

పదార్థాల అధిక వినియోగాన్ని తగ్గించడంవలన అత్యధిక ఫలితాలు పొందాలంటే, వినూతమైన శాస్త్ర, సాంకేతిక, రూపకల్పన పథకాలు అవసరం; ముడి పదార్థాల శుద్ధి క్రమంలో నూతన సాంకేతిక పద్ధతులు అవసరం; వస్తువుల బరువును తగ్గించాలి. వస్తువు భారంగా ఉండడం సాంకేతిక శ్రేష్ఠతకు లక్షణం కాదనీ, పైపెచ్చు, వస్తువు తేలికగా ఉన్నకొలది సాంకేతికంగా చాలా అభివృద్ధి పొందినదనీ బాగా తెలిసిన విషయం. సాంకే తిక నిర్దిష్ట లక్షణాలను యథాతథంగా ఉంచుతూనే కాదు, మెరుగుపరుస్తూ కూడా,

యంత్రాల బరువును తగ్గించాలంటే, రూపకల్పన స్థాయిని హెచ్చించాలి; ఉత్పత్తియొక్క సాధారణ సాంకేతిక స్థాయిని కూడా పెంచాలి. ఆయా శాఖల్లో, ప్రతి ఒక్క ఫ్యాక్టరీ లోనూ, ఉత్పత్తి యొక్క శాస్త్ర, సాంకేతిక స్థాయిని విలువ కట్టడానికి, ఆ వస్తువుల కింద పదార్థాల అధిక వినియోగాన్ని తగ్గించడం కొలబద్ద అవుతుంది. ఒకే పరిమాణం లోని ముడి పదార్థాలతో మరింత ఎక్కువగా పారిశ్రామిక సరకులు తయారయేలాగా చూడాలి. ఈ విషయంలో సాంకేతిక విజ్ఞానంలోనూ, ఉత్పత్తి వ్యవస్థీకరణలోనూ ఆధునిక శాస్త్రీయ పద్ధతులను విశేషంగా ఉపయోగించడమే గాక పొదుపుకూ, పాదార్థిక వినియోగంలో ఖచ్చితమైన లెక్కకూ, అధిక ప్రాముఖ్యం వుంటుంది. ప్రతి పరిశ్రమ ప్రణాళికలోనూ యీ ఏర్పాట్లు వుండాలి.

*ఫ్యాక్టరీల, మూల ఆస్తుల వినియోగాన్ని మెరుగుపరచ వలసిన* అవసరం చాలా వుంది. కొన్ని విభాగాలలో చాలా పరిశ్రమలు యింకా ఆస్తులు-ఉత్పత్తుల నిష్పత్తి తగ్గుదలనే చూపుతున్నాయని చెప్పవలసి వుంది. అంటే మూల ఉత్పత్తి ఆస్తుల్లో, రూబులుకు ఉత్పత్తి అయ్యే వస్తువు పరిమితి తక్కువగా వుంటూంది.

ఉత్పత్తులు - ఆస్తులు నిష్పత్తి అధికంగా రూపకల్పన శ్రేష్ఠత మీదా, నిర్మాణానికయిన ఖర్చుమీదా ఆధారపడి వుంటుంది. పాత పరిశ్రమలలో కన్న నూతన పరిశ్రమలలోనూ, నూతన ఉత్పత్తి రంగాలలోనూ, శ్రమ ఉత్పాదకతా, లాభసాటితనమూ, మూల ఉత్పత్తి ఆస్తుల్లో, రూబులుకు ఉత్పత్తి అయ్యే వస్తువులూ అధికంగా ఉండేటట్లు చూడడం మన లక్ష్యం కావాలి. ఇందుకోసం రూపకల్పన కార్యాలయాలూ, నిర్మాణ సంస్థలూ ఎక్కువ సమర్థవంతములైన సాంకేతిక పథకాలను సృష్టించాలి. నిర్మాణానికయ్యే కాలాన్నీ, ఖర్చునూ బాగా తగ్గించాలి, కొత్త ఆస్తులనూ, ఫ్యాక్టరీలనూ ఎక్కువ వేగంగా పనిలో పెట్టాలి.

సామర్థ్యాన్ని సూచించే ప్రతిదానినీ—శ్రమ ఉత్పాదకతను, పాదార్థిక సాంద్రతను, ఆస్తి - ఉత్పత్తి నిష్పత్తిని మెరుగు పరచడానికి పూనుకోవలసిన అవసరం ఉందని యింతవరకూ చెప్పిన దానినిపట్టి తేలుతూంది. దీనివలన చివరకు సామాజిక శ్రమను వినియోగించిన వాటన్నింటా అధికమైన పొదుపు సాధించగలం.

ముసాయిదా ఆదేశాలలో చెప్పినట్లు ఉత్పత్తి పెరగడం, దాని సామర్థ్యం ఎక్కువ కావడం జరిగినప్పుడు తొమ్మిదవ పంచవర్ష కాలంలో *విస్తృతమైన సామాజిక కార్యక్రమాన్ని* పూర్తి చేయడానికి గట్టి పునాది పడుతుంది. ఆ కార్యక్రమంలోని అంశాలలో కొన్ని:

ప్రజానీకంలోని అన్ని తరగతులవారి జీవన పరిస్థితులను మెరుగు పరచేందుకై చర్యలను అమలు జరపడం;

మనుష్యశక్తి వనరులను ఎక్కువ హేతుబద్ధంగా వినియోగించడం, పని పరిస్థితులను యింకా మెరుగుపరచడం;

ఆదాయాల పంపిణీ యంత్రాంగాన్నీ, ప్రతిఫలం యిచ్చే పద్ధతులనూ, కార్మికులకు ఆర్థిక, ప్రోత్సాహకాల నిచ్చే పద్ధతులనూ మెరుగుపరచడంతో సహా, ప్రజల ఆదాయాల పెరుగుదల వేగాన్ని పెంచడం;

వర్ధమానతరం పెంపకానికీ, అధిక సంతానం గల కుటుంబాల సహాయానికీ, మహిళల పనినీ, దైనందిన పరిస్థితులనూ మెరుగుపరచడానికీ కేటాయింపులను పెద్దగా పెంచటం;

ప్రజలయొక్క సాంస్కృతిక, సాంకేతిక స్థాయిలను యింకా పెంచడం, సార్వజనిక సెకండరీ విద్యను పూర్తిగా ప్రవేశపెట్టడం;

గ్రామీణ, పట్టణ ప్రజల జీవన స్థాయిలను బాగా సన్నిహిత పరచడం.

ప్రజల జీవనస్థాయి పెరుగుదలను ఒక విషయం చెప్తుంది: ప్రజల వాస్తవాదాయాల మొత్తం గత పంచవర్ష కాలంలో 54 వేల మిలియన్లు పెరుగుతే, ఈ నూతన పంచవర్ష కాలంలో 72 వేల మిలియన్ల రూబుళ్ళు పెరుగుతుంది. తలసరి లెక్కన చెప్పాలంటే, వాస్తవాదాయాలు రమారమి 30 శాతం పెరుగుతాయి.

సోషలిస్టు వ్యవస్థకు, అత్యధిక సమర్థవంతమైన శ్రమ వ్యవస్థీకరణతోనూ, శ్రామిక ప్రజలు సామర్థ్యాన్ని చూపి, పెంపొందించుకోడానికై ప్రోత్సాహకాలు యివ్వడంతోనూ పొత్తు కుదరదని మన శత్రువులు, తెలియనివాళ్ళను నమ్మించేందుకై సోషలిజాన్ని నిందిస్తున్నారు. నిజానికి సోషలిజం, కమ్యూనిజాలు స్వేచ్ఛతో కూడిన సృజనాత్మక శ్రమ విజయాన్ని తెలుపుతాయి. ప్రతి కార్మికుని యొక్క శ్రమ ఉత్పాదకత పెరగడానికీ, అతని అర్హతలు మెరుగు పరచడానికీ, సోషలిస్టు ప్రభుత్వం ప్రణాళిక వేసి, పరిస్థితులను కల్పిస్తుంది. అది పునాదిగా యావన్మంది ప్రజలకూ ఆదాయాలు పెరుగునట్లు చేస్తుంది, జీవన స్థాయిలు మెరుగు అయ్యేటట్లు చేస్తుంది. ఇప్పటికే ఎంతో జరిగింది. సమాజంలోని సభ్యులందరి శ్రమ సఫలం అయ్యేటట్లు చేయడానికై తొమ్మిదో పంచవర్ష ప్రణాళిక కాలంలో యింకా ఎంతో జరుగుతుంది.

కామ్రేడ్స్,.పెట్టుబడిదారీ ఆర్థికవ్యవస్థ కన్న తనకు అఖండ ప్రత్యేకత లున్నాయని సోవియట్ ఆర్థిక వ్యవస్థ తన అభివృద్ధి దశ లన్నింటా విస్పష్టంగా చూపింది.

ఈ ప్రత్యేకతల వల్లనే అది చారిత్రకంగా స్వల్ప వ్యవధిలో, సాంకేతికంగా అత్యాధునికమైన బృహత్పారిశ్రామిక పునాదిని నిర్మించడం, జాతీయార్థిక వ్యవస్థలోని ప్రతి శాఖకూ అత్యధిక నైపుణ్యం గల లక్షలాది సిబ్బందికి శిక్షణ యివ్వడం, అపార ప్రాకృతిక వనరుల్ని ఆర్థిక రంగంలోకి తీసుకురావడం సాధ్యమయింది. మన

ఆర్థికవ్యవస్థలో సంక్షోభాలు లేవు. మాంద్యాలు లేవు. ఇతరమైన ఆర్థిక ఎగుడు దిగుడులు లేవు.

మన దేశం యొక్క ఆర్థిక పెరుగుదల వేగంలోనూ, ఉత్పత్తి సామర్థ్యాన్ని వేగంగా నిర్మించుకోడంలోనూ దాని అఖండ పురోగతి వ్యక్తమవుతూంది. 1970 తో సహా గతానికి సంబంధించిన సమాచారం దిగువ నిస్తున్నాం:

తన జాతీయాదాయాన్ని రెట్టింపు చేసుకొనేందుకు అమెరికాకు 20 ఏళ్లు, బ్రిటనుకు 30 ఏళ్లు పైగా, జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్కుకు దాదాపు 15 ఏళ్లు, సోవియట్ యూనియనుకు, మనకున్న అపార సామాజికోత్పత్తి ప్రమాణంతో 10 ఏళ్ళు పట్టింది.

పారిశ్రామికోత్పత్తిని రెట్టింపు చేసుకోడానికి అమెరికాకు 18 ఏళ్ళు, బ్రిటనుకు 22 ఏళ్ళు, జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్‌కు 11 ఏళ్ళు, సోవియట్‌కు 8.5 ఏళ్ళు పట్టింది.

తన మూల ఉత్పత్తి ఆస్తులు రెట్టింపు చేసుకోడానికి అమెరికాకు 22 ఏళ్ళు, బ్రిటనుకు 19 ఏళ్ళు, జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్‌కు 10 ఏళ్ళు, సోవియట్‌కు 8 ఏళ్ళు పట్టింది.

సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ పురోగమనం అల్లా వుంది. మన ఆర్థికాభివృద్ధి సమతూకం కలిగి, శక్తివంతంగా ఉన్నదనేందు కది సాక్ష్యం. ఈ పెట్టుబడిదారీ దేశాలలో దేనికీ శక్తివంతం అయిన ఆర్థిక వ్యవస్థ లేదు.

ప్రతి స్పర్థులైన రెండు సామాజిక వ్యవస్థల మధ్య సాగుతున్న ఆర్థిక పోటీలో మనం ముందు ముందు ఎంతో దీర్ఘమూ, కఠినమూనైన పోరాటం జరపవలసి వుంది. ఈ పోరాటంలో అంతిమ విజయం సోషలిజానిదేనని కమ్యూనిస్టులమైన మనం విశ్వసిస్తున్నాము.

పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలు పూర్తి చేస్తే మన ఆర్థిక వ్యవస్థకు ముందుకు మరో వూపు లభిస్తుంది. సోవియటు ప్రజల జీవన స్థాయిని బాగా పెంచేందుకు అవకాశం ఏర్పడుతుంది.

# III
# పాదార్థికోత్పత్తి పెరుగుదల

క్రేమ్లిన్ ముసాయిదా ఆదేశాలు పాదార్థికోత్పత్తిశాఖలన్నిటి అభివృద్ధికీ సమగ్రమైన కార్యక్రమం ఒకటి రూపొందించాయి. అతిముఖ్యమైన కొన్ని కర్తవ్యాలనిక్కడ వివరిస్తాను.

*పరిశ్రమ*. 1975 నాటికి పారిశ్రామికోత్పత్తి 528-544 వేల మిలియన్ల రూబుళ్ళకి పెంచాలని ప్రణాళిక లక్ష్యం. 1965లో 248 వేల మిలియన్ల రూబుళ్ల విలువచేసే వస్తువుల మొత్తం ఉత్పత్తి చేయబడిందని గుర్తు చేయదలిచాను. ఆ విధంగా మన దేశంలో పారిశ్రామికోత్పత్తి పదేళ్ళలో రెట్టింపు పైగా పెరిగింది.

ఉత్పత్తి నిరాఘాటంగా పెరుగుతూండడం మన పరిశ్రమాభివృద్ధికి మూల నియమం. శాఖ లన్నింటా సత్వరాభివృద్ధికి ఈ నూతన పంచవర్ష ప్రణాళికలో ఏర్పాట్లు చేయబడినాయి. మూడు పంచవర్ష ప్రణాళికల కాలంలో పారిశ్రామికోత్పత్తి ఏ విధంగా పెరిగిందో దిగువ అంకెలు చూపిస్తాయి. ఉదాహరణకు 7 వ పంచవర్ష ప్రణాళిక కాలంలో పారిశ్రామికోత్పత్తిలో వచ్చిన మొత్తం పెరుగుదల 84 వేల మిలియన్ల రూబుళ్ళు; ఎనిమిదో ప్రణాళిక కాలంలో 125 వేల మిలియన్ల రూబుళ్ళకు చేరింది. తొమ్మిదో ప్రణాళికలో 155-171 వేల మిలియన్ల రూబుళ్లు అవుతుంది.

దేశ ఆర్థిక శక్తికీ, ప్రజల జీవన స్థాయి ఇంకా పెరగడానికీ పునాది ఇంతకు పూర్వం, ఇకముందూ కూడ భారీ పరిశ్రమలే. అది సాంకేతికాభివృద్ధికి, వ్యవసాయమూ, వాడకం వస్తువుల నుత్పత్తి చేసే శాఖలతో సహా యావత్తు జాతీయార్థిక వ్యవస్థ అభివృద్ధికి తోడ్పడుతుంది. సోవియటు రాజ్యం యొక్క రక్షణ సామర్థ్యాన్ని బాగా పెంచుతుంది. ఈ కర్తవ్యాలు మన ప్రజలకు సర్వ ప్రధానమైనవి. భారీ పరిశ్రమల కార్మికులు వానిని ప్రతిష్ఠాకరంగా నిర్వహించగలరనే విశ్వసిస్తున్నాము.

మొట్టమొదట *ఇంధన, విద్యుత్పరిశ్రమల* గురించి చెప్పాలి. జాతీయార్థిక వ్యవస్థలోనూ, ప్రజలలోనూ పెరిగిపోతున్న ఇంధన, విద్యుదవసరాలను ఈ పరిశ్రమలు సంతృప్తి పరచాలి. ఇంధనం, విద్యుత్తు వాడకం పద్ధతిని మెరుగు పరచాలి.

నూతన పంచవర్ష ప్రణాళిక కాలంలో ఇంధనం, విద్యుత్తుల వుత్పత్తి ఈ విధంగా వుంటుంది.

| | ఉత్పత్తులు 1970 | ఉత్పత్తులు 1975 (ముసాయిదా ఆదేశాల ప్రకారం) | ఉత్పత్తుల మొత్తం పెరుగుదల 8వ పంచవర్ష ప్రణాళిక | ఉత్పత్తుల మొత్తం పెరుగుదల 9వ పంచవర్ష ప్రణాళిక |
|---|---|---|---|---|
| విద్యుచ్ఛక్తి (వేలమిలియన్ల కిలోవాట్ గంటల్లో) | 740 | 1030-1070 | 233 | 290-330 |
| నూనె(ద్రవీ భూత పెట్రోల్ గ్యాసుగాక— మిలియన్ల టన్నులలో) | 349 | 480- 500 | 107 | 131-151 |
| ఖనిజవాయువు (వేల మిలియన్ల ఘనపు మీటర్లు) | 198 | 300- 320 | 70 | 102-122 |
| బొగ్గు (మిలియన్ల టన్నులు) | 624 | 685- 695 | 46 | 61- 71 |

65-67 మిలియన్‌ల కిలోవాట్ల మొత్తం ఉత్పాదక శక్తిగల కొత్త విద్యుత్కేంద్రాలను ఈ అయిదేళ్ళలో పనిలో పెడతారు. ఉత్పత్తి సామర్థ్యం పెరుగుదలలో 12 శాతం అణు విద్యుత్కేంద్రాలనుంచి లభ్యమవుతుందనే విషయం ముఖ్యమైంది.

రాగల అయిదేళ్ళలో, ముఖ్యంగా ఇంధనం వనరులు తక్కువగా వున్న యూరపియన్ భాగంలో అణు విద్యుత్కేంద్రాల నిర్మాణానికి విస్తృత కార్యక్రమం ప్రారంభిస్తున్నాం. ఈ కార్యక్రమం ప్రకారం రాగల 10-12 ఏళ్ళలో 30 మిలియన్‌ల కిలోవాట్ల మొత్తం ఉత్పాదకత గల అణు విద్యుత్కేంద్రాలు పనిలో పెట్టబడతాయి. ఇందువలన బొగ్గు పరిశ్రమాభివృద్ధికి పెట్టవలసి వచ్చే మదుపులో 3 వేల మిలియన్‌ల రూబుళ్ళు కలిసి వస్తుంది. ఈ కార్యక్రమాన్ని గత ప్రణాళిక కాలంలోనే ఎత్తుకోకపోడానికి కారణం అప్పటికి ఇంజినీరింగ్ పరిశ్రమ అణు విద్యుత్కేంద్రాలకు కావలసిన పరికరాలను అవసరమైనంతగా వుత్పత్తి చేయగల స్థితి లేకపోవడమే.

ఈ రంగంలో సాంకేతికాభివృద్ధిని త్వరితపరచే పెద్ద మార్పులు తొమ్మిదో ప్రణాళిక కాలంలో విద్యుత్పరిశ్రమాభివృద్ధిలో కలుగుతాయి. ఒక్కొక్కటి 3 లక్షల కిలోవాట్లనే గాక, 500,000, 800,000, 12,00,000 కిలోవాట్ల వరకూ వుత్పత్తి చేయగల యంత్రాను అమర్చి మొత్తం 4000,000 కిలోవాట్ల శక్తివరకూ వుత్పత్తి చేయగల పెద్ద పెద్ద థర్మల్ విద్యుత్కేంద్రాలను నిర్మించేందుకు పథకం వేయబడింది. దీనివలన ఇంధనం ఎంతో పొదుపు అవడమేగాక, విద్యుత్పరిశ్రమలో శ్రమ వుత్పాదకత వేగంగా పెరుగుతుంది.

సోవియట్‌దేశ యూరపు భాగంలో గత పంచవర్ష కాలంలోనే సమగ్రమైన విద్యుత్ గ్రిడ్ ఏర్పాటు పూర్తి అయింది. ఇప్పుడు సోవియట్ యూనియను కంతకూ కలిపి సమగ్ర విద్యుత్ గ్రిడ్ నిర్మించబడుతూంది. త్వరలోనే సైబీరియా నుంచీ, కజక్‌స్తాన్ నుంచీ విద్యుత్తును యూరపియన్ భాగాలకు తీసుకు రాగలుగుతాము. ఇంచుమించుగా సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల నన్నిటినీ ప్రభుత్వ విద్యుత్ గ్రిడ్లతో కలుపుతారు.

త్యుమెన్, మాంగిస్లాక్‌లలోని బ్రహ్మాండమైన నూతన నూనె గనుల్లో పెద్ద ఎత్తున నూనె తవ్వకం తొమ్మిదో ప్రణాళికలో ప్రారంభ మవుతుంది. నూనె ఉత్పత్తి పెరుగుదలలో 75 శాతం పై గనుల నుంచే వస్తుంది. యూరపియన్ భాగాలలో వున్న పాత నూనె గనులనుంచి నూనె మరింత బాగా తీయడం ఒక ముఖ్యమైన కర్తవ్యం. నూనె వున్న పొరలమీద ఒత్తిడిని ప్రయోగించే సమర్ధములయిన పద్ధతులను విరివిగా వాడడం ఈ కర్తవ్య పరిపూర్తికి అవసరం. ప్రధానంగా ఓరెన్‌బర్గ్ ప్రాంతం, కోమి స్వపరిపాలిత రిపబ్లిక్, త్యుమెన్ మండలం, ఉజ్బెకిస్తాన్, తుర్క్‌మన్ యూనియన్ రిపబ్లిక్కులలో వున్న అసాధారణము లయిన కొత్త నిధులను పెంపొందించడం వల్లనే ఖనిజ వాయూత్పత్తి విపరీతంగా పెంచడం సాధ్యం అవుతుంది. ఈ నిధులే దేశంలోని ముఖ్యమైన ఖనిజవాయు వనరులు అవుతాయి. నూనె, ఖనిజవాయు నిధులున్న ప్రాంతాలనుంచి, వానిని

ఉపయోగించే ప్రధాన ప్రాంతాలకు—వేల కిలోమీటర్ల దూరాలకు—అపరిమిత పరిమాణంలో ఖనిజ తైలాన్నీ, ఖనిజ వాయువునూ సమర్థవంతంగా పంపేటందుకు పెద్ద పెద్ద వ్యాసం గల గొట్టాల వరస వేయాలి.

నూనె శుద్ధి పరిశ్రమలో అతి శ్రేష్ఠములైన నూనె ఉత్పత్తుల తయారీకి, ముఖ్యంగా గంధకం పాలు తగ్గులో వుండే డీసెల్ నూనె, ఆక్టేన్ అధికంగా వున్న కారు పెట్రోల్, బాగా శక్తివంతములైన పదార్థాలను చేర్చి వున్న కందెన తైలాల వుత్పత్తికి ప్రత్యేక శ్రద్ధ చూపబడుతుంది.

బొగ్గు తవ్వకం ఖర్చును బాగా తగ్గించేటందుకూ, గని కార్మికుల పని పరిస్థితులను మెరుగు పరచేందుకూ, బొగ్గు పరిశ్రమను నూతన పరికరాలతో సజ్జితం చెయ్యాలని ముసాయిదా ఆదేశాలు కోరుతున్నాయి. పెద్ద క్వారీలలో ఓపెన్-కాస్ట్ తవ్వకాన్ని పెంపొందించేందుకు అధిక ప్రాధాన్యం ఇవ్వబడుతుంది. ఈ పద్ధతిద్వారా మొత్తం బొగ్గు ఉత్పత్తిలో మూడో వంతును ఉత్పత్తి చేయటం జరుగుతుంది. సమగ్రంగా యంత్రాలను ప్రవేశ పెట్టడం, కష్టతరమైన పనులలో, ముఖ్యంగా భూగర్భంలో పనులకు స్వయంచలిత యంత్రాల నుపయోగించడం వలన బొగ్గు తవ్వకం పరిశ్రమలో శ్రమ వుత్పాదకత 40 శాతం పెరుగుతుంది. గడచిన అయిదేళ్ళలో ఆ పెరుగుదల 20 శాతం మాత్రమే వుంది. కొత్త పంచ వర్ష కాలంలో బొగ్గు వుత్పత్తిలో తలపెట్టిన 11 శాతం పెరుగుదల 20 శాతం తక్కువ మంది కార్మికులతో సాధించబడుతుంది.

*ముడి పదార్థాల పరిశ్రమలు* అభివృద్ధి పొందించబడే రెండో ముఖ్యమయిన పరిశ్రమల గ్రూపు అని చెప్పాలి. జాతీయార్థిక వ్యవస్థకు అవసరమైనన్ని రకాల, శ్రేష్ఠమైన ముడి సరుకుల్నీ ఇతర వస్తువుల్నీ—అనంతర పరివృద్ధి కోసం బాగా తయారుచేసి సరఫరా చేస్తూండడం వాటి ప్రధాన కర్తవ్యం.

ముఖ్యమయిన ముడివస్తువుల్నీ, తదితర పదార్థాలనూ దిగువ చెప్పిన పరిమాణాలలో ఉత్పత్తి చేయాలని ముసాయిదా ఆదేశాలు నిర్దేశిస్తున్నాయి

| | ఉత్పత్తి 1970 | ఉత్పత్తి 1975 (ముసాయిదా ఆదేశాల ప్రకారం) | మొత్తం ఉత్పత్తి పెరుగుదల 8వ పంచవర్ష ప్రణాళిక | మొత్తం ఉత్పత్తి పెరుగుదల 9వ పంచవర్ష ప్రణాళిక |
|---|---|---|---|---|
| ఉక్కు (మిలియన్ల టన్నులు) | 116 | 142-150 | 25 | 26-34 |
| రసాయన, పెట్రో రసాయన పరిశ్రమల వుత్పత్తి (వేల మిలియన్ల రూబుళ్ళలో) | 21.1 | 36.2 | 9.3 | 15.1 |
| ప్లాస్టిక్, కృత్రిమ రెసిన్లు (వేల టన్నులు) | 1672 | 3457 | 869 | 1785 |
| రసానిక దారాలు (వేల టన్నులు) | 623 | 1050-1100 | 216 | 427-477 |
| కాగితం గుజ్జు (వేల టన్నులు) | 5110 | 8490 | 1875 | 3380 |
| కాగితం (వేల టన్నులు) | 4185 | 5560 | 954 | 1375 |
| సిమెంటు (మిలియన్ల టన్నులు) | 95 | 122-127 | 23 | 27-32 |

ఈ పంచవర్ష కాలంలో ఇనుము కలిసిన లోహాల వుత్పత్తి 28 శాతం, అయో రహిత లోహాల వుత్పత్తి 40 శాతం పెరగవలసి వుంది.

లోహ పరిశ్రమలో యంత్రాల ఉత్పత్తి శక్తి బాగా పెరుగుతుంది. 3200 ఘన మీటర్ల వినియోగార్హమైన వైశాల్యం వున్న బ్లాస్ట్-ఫర్నేస్‌ల నిర్మాణం కొనసాగించడానికే పథకం వేయబడింది. 1975లో 5000 ఘనమీటర్ల వైశాల్యంగల బ్లాస్ట్ ఫర్నేస్ నిర్మాణానికి ఏర్పాటు చేయబడింది. ప్రాణవాయు కన్వర్టర్లలో కరిగించబడే వుక్కు వాటా మొత్తం వుక్కు వుత్పత్తిలో 30 శాతానికి పెరుగుతుంది. కన్వర్టర్ల గరిష్ఠ ఉత్పాదకశక్తి 130 నుంచి 350 టన్నుల వరకూ హెచ్చించ బడింది. నిరంతరధారా ప్రక్రియలో వుత్పత్తి అయ్యే ఉక్కు బాగా హెచ్చు అవుతుంది.

కరిగించేందుకు సన్నాహంగా ముడి యినుము చాలా బాగా పరిశుద్ధి చేయబడుతుంది. యంత్ర నిర్మాతలకు అనేక ఆకారాలు, ప్రమాణాలతో ఉక్కు రేకులు, కడ్డీలు మొదలయినవాటిని లోహ పరిశ్రమ అందచెయ్యాలి. ఇంజినీరింగ్ పరిశ్రమలో వీటి పనిని కనీస స్థాయికి తగ్గించ గలుగునట్లు ఆ ఆకారాలూ, ప్రమాణాలూ అసలు మూర్తులకు (ప్రిసిషన్ బ్లాంక్స్) చాల దగ్గరలో వుండాలి. గొట్టాల ఉత్పత్తి అభివృద్ధిని ఇంకా త్వరిత పరచడానికై ఏర్పాటు చేయబడింది. పెద్ద వ్యాసం వున్న ఖనిజవాయు గొట్టాలనూ, ఇంజినీయరింగ్ పరిశ్రమకు పల్చని గోడలున్న గొట్టాలను, నూనె, ఖనిజవాయు పరిశ్రమలకై భారీ గొట్టాలనూ నిర్మించాలని పథకం.

ముసాయిదా ఆదేశాలు నిర్దేశించిన మేరకు అయోరహిత లోహాల వుత్పత్తి స్థాయిని సాధించాలంటే, బ్రాత్స్క్, క్రాస్నోయార్స్క్, ఇర్కుత్స్క్‌లలో అల్యూమినియం కర్మాగారాల నిర్మాణం పూర్తి చెయ్యాలి. నొరిల్స్క్, జెజ్‌కాజ్‌గాన్, అల్మలిక్, గైలలో వున్న పరిశ్రమ సమూహాల్ని పెంచి, పునర్నిర్మించాలి. అయోరహిత లోహ పరిశ్రమకు ముడిసరుకుల్ని నమ్మకంగా, నిరంతరాయంగా అందించగల పునాదిని నిర్మించేటందుకు అధిక శ్రద్ధ చూపాలి. వజ్రాలు, బంగారం మొదలైన అమూల్య లోహాల వుత్పత్తిని ఇంకా ఎక్కువ చేయడం చాల ముఖ్యమైన కర్తవ్యం.

గడచిన సంవత్సరాలలో ప్రభుత్వం రసాయన పరిశ్రమల్లో పెట్టిన అపారమైన పెట్టుబడులకు నూతన పంచవర్ష ప్రణాళిక కాలంలో పూర్తి ఫలితం అందుకోవాలి. రసాయన ఎరువుల వుత్పత్తి 90 మిలియన్‌ల టన్నుల ప్రమాణాన్ని అందుకొంటుంది. వానిలో 80 శాతం అత్యంత సారవంతమయిన, మిశ్రమ ఎరువులే. రాసాయనిక దారాల వుత్పత్తి 70 శాతం పైగా పెరుగుతుంది. ప్లాస్టిక్స్, కృత్రిమ రెసిన్‌ల వుత్పత్తి నూరు శాతం, గృహోపయోగ రసాయనాల వుత్పత్తి 90 శాతం పెరుగుతుంది.

రసాయన పరిశ్రమ, దాని సాధన సామగ్రుల అభివృద్ధి పరిమితిని చెప్పడానికి ఒక వుదాహరణ నిస్తాను: 400,000-450,000 టన్నుల అమ్మోనియాను వుత్పత్తి చేయగల

యంత్రాలు నెవినోమిస్క్, సెవెరోదోనెత్స్క్, నొవోమస్కొవ్స్క్‌లలోని రాసాయనిక కర్మాగారాలలో ప్రస్తుతం నిర్మించబడుతున్నాయి. వీనిలో ఒక్క యంత్రం యొక్క ఉత్పత్తి శక్తి 1948 లో మన దేశంలో పని చేస్తున్న అమ్మోనియా ఫ్యాక్టరీ లన్నింటికీ ఇంచుమించు సమానం. ఈ యంత్రాల్లోని శ్రామిక వుత్పాదకత ఇప్పుడున్న తక్కువ ఉత్పాదకశక్తి గల యంత్రాలకన్న పదింతలు ఎక్కువ.

రబ్బరు పరిశ్రమ త్వరితంగా పెరగాలి. టైర్ల వుత్పత్తి 1975 నాటికి 50 మిలియన్‌ల సంఖ్య నందుకుంటుంది. రబ్బరు వుత్పత్తి 70 శాతం పెరుగుతుంది.

రసాయన పరిశ్రమను త్వరగా విస్తరింప చేయాలంటే అన్ని తరహాల రసాయనిక వస్తువుల ప్రారిశ్రామిక - ప్రాథమిక ముడివస్తువులు, రసాయన వస్తువులు, అర్ధ పారిశ్రామిక వస్తువుల—వుత్పత్తి బాగా సమతూకంలో జరిగించడం ఎంతో ముఖ్యం.

కలప, కర్రపని పరిశ్రమలలో కలపను పూర్తిగా వినియోగించే విషయమై ప్రత్యేక శ్రద్ధ చూపాలి. నూతన పంచవర్ష ప్రణాళికా కాలంలో, సమగ్రమయిన రసాయనిక, యాంత్రిక ప్రక్రియల ద్వారా కలప వినియోగ నిష్పత్తిని 75 శాతం వరకూ పెంచాలి. దాని ఫలితంగా నార అట్టల వుత్పత్తి 180-190 శాతమూ, గుజ్జు 70 శాతమూ పెరుగుతాయి.

జాతీయ ఆర్థిక వ్యవస్థకంతకూ సాంకేతిక పరికరాలను పునస్సమాయత్తం చేయడంలో *ఇంజినీరింగ్ పరిశ్రమ* పాదార్థిక పునాది. ఎంతో సమర్థవంతమయిన యంత్రాలను, పరికరాలను పరిశ్రమ లన్నింటికి అందచేయడం దాని ప్రధాన బాధ్యత. కొత్త యంత్రాల ఉత్పత్తి శక్తి అధికంగా వుండాలి. ఉత్పత్తి వ్యయాన్ని తగ్గించగలగాలి.

ఇంజినీరింగ్ వస్తువుల వుత్పత్తి పరిమాణాలను ముసాయిదా ఆదేశాలు దిగువ విధంగా విధిస్తున్నాయి:

| | ఉత్పత్తి | | ఉత్పత్తి మొత్తం పెరుగుదల | |
|---|---|---|---|---|
| | 1970 | 1975 (ముసాయిదా ఆదేశాల ప్రకారం) | 8వ ప్రణాళిక | 9వ ప్రణాళిక |
| ఇంజినీరింగు, లోహ కార పరిశ్రమలలో వుత్పత్తి (వేల మిలియన్‌ల రూబుళ్లు) | 88 | 148 | 37 | 60 |
| మోటారు వాహనాలు (వేల సంఖ్యలో) | 916 | 2000-2100 | 300 | 1084-1184 |
| వానిలో ప్రయాణీకుల కార్లు (వేల సంఖ్యలో) | 344 | 1200-1300 | 143 | 856-956 |

| | ఉత్పత్తి 1970 | 1975 (ముసాయిదా ఆదేశాల ప్రకారం) | ఉత్పత్తి మొత్తం పెరుగుదల 8వ ప్రణాళిక | 9వ ప్రణాళిక |
|---|---|---|---|---|
| పనిముట్లు, స్వయంచాలక సాధనాలు, వాని విడి భాగాలు (మిలియన్ల రూబుళ్ళ) | 3102 | 6155 | 1684 | 3053 |
| తేలిక రకం, ఆహార పరిశ్రమలకు యంత్రాలు, పరికరాలు (మిలియన్ల రూబుళ్ళలో) | 771 | 1564 | 263 | 793 |
| వ్యవసాయ యంత్రాలు (మిలియన్ల రూబుళ్లు) | 2115 | 3500 | 619 | 1385 |
| ట్రాక్టర్లు (వేల సంఖ్యలో) | 458.5 | 575 | 104 | 116.5 |
| (మిలియన్ల అశ్వ శక్తి) | 29.4 | 53 | 8.4 | 23.6 |
| ధాన్యం నూర్పిడి యంత్రాలు (వేల సంఖ్యలో) | 99.2 | 138 | 13.4 | 38.8 |

కఠినమయిన శారీరక శ్రమను యాంత్రికం చేయడం కోసం కావలసిన యంత్రాలనూ, అన్ని శాఖల్లోనూ, ముఖ్యంగా వ్యవసాయంలో ప్రధాన ఉత్పత్తి ప్రక్రియల్ని సమగ్రంగా యంత్రపరం చేయడానికై కావలసిన యంత్ర వ్యవస్థలను జాతీయార్థిక వ్యవస్థలోని విభాగాలన్నింటికీ సరఫరా చేయడం, యంత్ర నిర్మాతల నెదు ర్కొంటున్న బాధ్యత. 1975 నాటికి ప్రణాళిక ప్రకారం వ్యవసాయ యంత్రాల వుత్పత్తి 65 శాతం పెరుగుతుంది. ట్రాక్టరు నమూనాల పరిధిని బాగా విస్తరింప చేయడమూ, వాని యూనిటు సామర్థ్యాన్ని హెచ్చించడమూతో ట్రాక్టర్ల వుత్పత్తి 25 శాతం పెరుగుతుంది.

స్వయంచాలన పరికరాల, సాధనాల వుత్పత్తి రెట్టింపు అవుతుంది. శాస్త్ర పరికరాల తయారీ బాగా పెంపొందుతుంది. ఎలక్ట్రానిక్ కంప్యూటర్ల వుత్పత్తి 160 శాతం పెరుగుతుంది.

నూతన పంచవర్ష ప్రణాళికలో సోవియట్ మోటారు పరిశ్రమ బాగా అభివృద్ధి పొందుతుంది. 22 కొత్త రకాల లారీల, ట్రాక్టరు లారీల వుత్పత్తిలో చాతుర్యం గడించాలి. వాని భారవాహక శక్తిని పెంచాలి. లారీలకూ, చక్రాల ట్రాక్టర్లకూ ట్రైలర్ల వుత్పత్తిని అధికం చేయడానికై ప్రణాళికలో చర్యలు నిర్దేశించబడినాయి. పంచవర్ష ప్రణాళికలోని ప్రధానములయిన ప్రాజెక్టులలో కామా మోటరు ఫ్యాక్టరీలో ఏడాదికి 1,50,000 డీసెల్ లారీలూ, ట్రక్కులూ-ట్రైలర్ల జంటలూ వుత్పత్తి అవుతాయి.

1972 లో నిర్మాణం పూర్తి అయ్యే వోల్గా కార్ల కర్మాగారం ఇప్పుడే పని ప్రారంభిస్తూంది. ఇది ఏటా 660,000 కార్లు తయారు చేయగలుగుతుంది. మాస్కోలోని లెనిన్ కామ్‌సోమాల్ కార్ల ఫ్యాక్టరీ పునర్నిర్మాణం పూర్తి అయిన ఏడాది నాటికి మాస్క్విచ్ కార్ల వుత్పత్తి రెట్టింపై 200,000 సంఖ్యను చేరుతుంది. కొత్త ఇజ్వెస్క్ ఫ్యాక్టరీ ఈ ఏడాది అప్పుడే 70,000 కార్లు వుత్పత్తి చేస్తుంది. ఫ్యాక్టరీ పూర్తిగా పనిలో పడిన నాడు అది ఏటా 2,20,000 కార్లు వుత్పత్తి చేస్తుంది. వీటన్నింటి వల్లనూ 1975 నాటికి 12-13 లక్షల కార్లు వుత్పత్తి చేయడం సాధ్యమవుతుంది. 1970 లో కార్ల వుత్పత్తి 3,44,000 మాత్రమే.

తన కిచ్చిన బృహత్తర బాధ్యతల్ని ఇంజినీరింగ్ పరిశ్రమ నెరవేర్చగలగాలంటే, దానికి కొత్త సాంకేతిక పరికరాలు త్వరితంగా సమకూర్చవలసి వుంటుంది. ఈ విషయంలో యంత్ర పరికరాల పరిశ్రమ నిర్ణయాత్మకమైన పాత్ర నిర్వహిస్తుంది. కొత్త పంచవర్ష ప్రణాళికలో పరికరాల వుత్పత్తి స్వరూపం బాగా మెరుగవుతుంది: ఫోర్జ్, ప్రెస్, ఫౌండ్రీ, వెల్డింగ్ పరికరాలు, గ్రైండింగ్, ఫినిషింగ్ పనిముట్లు, అధిక, అత్యధిక సున్నితమైన యంత్ర పరికరాలు ఎక్కువగా వుత్పత్తి చేయబడతాయి. ఇంజినీరింగ్ పరిశ్రమ కోసం, స్వయంచాలక, అర్ధ స్వయంచాలక ఉత్పత్తి శాఖల్లో జరిగేవుత్పత్తి 60 శాతం హెచ్చుతుంది. నిర్ణీత ఉత్పత్తి కార్యక్రమాన్ని వాటంతకవే నిర్వహించే లేతుల వుత్పత్తి కనీసం 250 శాతం పెరుగుతుంది. తత్ఫలితంగా శ్రమ వుత్పాదకతను మూడు నాలుగింతలు పెంచవచ్చు.

ప్రస్తుతం పని చేస్తున్న ఫ్యాక్టరీలలో వున్న పాత యంత్రాలను మార్చి, కొత్తవి ఏర్పరచడం వలన ఇంజినీరింగ్ పరిశ్రమ యొక్క సాంకేతిక స్థాయి బాగా పెరుగుతుంది. లోహాలుకోసే లేతుల వుత్పత్తిలో 25-30 శాతం, ఫోర్జి, ప్రెస్ యంత్రాల వుత్పత్తిలో కనీసం 30 శాతం ఇందుకోసం ఖర్చు అయిపోతాయి.

ఉత్పత్తిలో ఇంకా ప్రత్యేక కేంద్రీకరణ తెచ్చేందుకు గట్టి పూనికను కనబరచడమే కొత్త పంచవర్ష ప్రణాళికలో ఇంజినీరింగ్ పరిశ్రమ త్వరగా అభివృద్ధి పొందడానికి ప్రధానావసరం. స్వయంచాలక స్థాయి అధికంగా వున్న ప్రత్యేక కర్మాగారాల అభివృద్ధికి సర్వప్రాధాన్యం ఇవ్వాలి. యంత్ర భాగాలను, యంత్రాలను, పరికరాలను అత్యధికంగా ఏకస్థాయికి తేవడం, సాంకేతిక ప్రక్రియల ప్రామాణికీకరణ కేంద్రీకృత, ప్రత్యేక ఉత్పత్తి శాఖలు అభివృద్ధి పొందడానికి పునాదిగా ఉపయోగపడతాయి. సరకులను ఎత్తి రవాణా చేయడానికి వుపయోగపడే సాధన సామగ్రులను, విద్యుత్తుతో పనిచేసే పరికరాలను, ప్రత్యేక ప్రయోజనాలకు వుపకరించే సాంకేతిక సాధనాలను, జిగ్గులను, ఫిక్స్చర్లను ఉత్పత్తి చేయడం బాగా విస్తరించాలి.

ఉన్నతమైన షిఫ్ట్ పద్ధతి, ఇంజినీరింగ్ పరిశ్రమలో నిగూఢ శక్తి నిధులను అపా

రంగా విడుదల చేస్తుంది. సోవియట్ ప్రణాళికా సంఘం యొక్క లెక్కల ప్రకారం దీనివలన 7-8 వేల మిలియన్ల రూబుళ్ళ విలువగల ఉత్పత్తి అదనంగా జరుగుతుంది. యంత్రాదులకై పెట్టే మదుపులో 6-7 వేల మిలియన్ల రూబుళ్ళ పొదుపు అవుతాయి. అత్యధికమైన షిప్టు పద్ధతివల్ల అధిక లాభాన్ని సంపాదించాలంటే శ్రమను యాంత్రికం చేయడం ప్రధానంగా జరగాలి. దీనివలన కష్టతరమైన అనుబంధ పనుల నుంచి రెండో షిఫ్ట్‌లో నేర్పరితనం కావలసిన పనులకు పనివారిని మార్చ వీలవుతుంది.

ముసాయిదా ఆదేశాలలో విధించిన రీతిగా ప్రజల జీవన స్థాయి బాగా పెరగడం దృష్ట్యా, *వాడకం వస్తు పరిశ్రమల పాత్ర, కర్తవ్యాలు ఎక్కువౌతాయి.*

ఈ పరిశ్రమలకు ముసాయిదా ఆదేశాలు నిర్ణయించిన ఉత్పత్తి స్థాయిలు ఇవి:

| | ఉత్పత్తి | | ఉత్పత్తి మొత్తం పెరుగుదల | |
|---|---|---|---|---|
| | 1970 | 1975 ముసాయిదా ఆదేశాల ప్రకారం | ౮వ ప్రణాళికలో | ౯వ ప్రణాళికలో |
| తేలికరకం పరిశ్రమల వుత్పత్తి, సాంస్కృతిక, గృహోపయోగ వస్తువులు (వేల మిలియన్ల రూబుళ్ళలో) | 76.5 | 112.4 | 27.4 | 35.9 |
| ఫర్నీచరు (వేల మిలియన్ల రూబుళ్లు) | 2.8 | 4.55 | 1.0 | 1.75 |
| రెఫ్రిజిరేటర్లు (వేల సంఖ్యలో) | 4140 | 6686 | 2465 | 2546 |
| వస్త్రాలు (వేల మిలియన్ల చదరపు మీటర్లు) | 8.9 | 10.5-11 | 1.4 | 1.6-2.1 |
| చర్మ పాదరక్షలు (మిలియన్ల జతలు) | 676 | 800-830 | 190 | 124-154 |
| ఆహారం, మాంసం, పాడి వస్తువులు, చేపల పరిశ్రమల వుత్పత్తి (వేల మిలియన్ల రూబుళ్ళు) | 78.8 | 106.6 | 19.3 | 27.8 |

అనుకొన్న ప్రకారం ఈ వస్తువుల వుత్పత్తి పెరుగుదలను సాధించాలంటే తేలిక రకం, ఆహారపరిశ్రమల కర్మాగారాలకు అవసరమైన పరికరాలను అధికంగా అందచెయ్యాలి. వాని పరికరాల వుత్పత్తి రెట్టింపు అవాలి. ఉదాహరణకి, జౌళి పరిశ్రమకు ఎంతో సమర్థవంతంగా పనిచేసే, కదుళ్లలేని వడుకు చట్రాలను, ఆసులులేని మగ్గాలను, మెరుగుపెట్టే పరికరాలను, అర్ధ స్వయంచాలక, స్వయంచాలక ట్రాన్స్‌ఫర్ లైన్లను, ఇతర యంత్రాలను అందచేస్తారు. దీనివలన శ్రమ వుత్పాదకత 50-100 శాతం పెరుగుతుంది. వడుకు చట్రాలు, మగ్గాల మొత్తంలో ఇంచుమించు మూడోవంతును తీసేపి కొత్త పరికరాలను

అమరుస్తారు. ఆహార పరిశ్రమకు, ముడి పదార్థాలను పరిశుద్ధం చేసేందుకూ, సీసాలకు పట్టేందుకూ, బంగీలు కట్టేందుకూ, సమగ్రంగా స్వయంచలితములైన, యంత్రీకృత శ్రేణులు అందచేయబడతాయి. అత్యాధునిక యంత్రాలను తేలికరకం, ఆహార పరిశ్రమలకు సమకూర్చడం తొమ్మిదో పంచవర్ష ప్రణాళిక యొక్క ఒక ముఖ్య కర్తవ్యం. దీనిని కూడా మనం నెరవేర్చవలసిందే.

తేలికరకం, ఆహార పరిశ్రమలకై ముడి వస్తువుల వనరుల్ని బాగా విస్తృత పరచవలసి వుంది. కొత్త కొత్త కృత్రిమ పదార్థాల వుత్పత్తిని హెచ్చు చేయాలి. వ్యావసాయిక ముడి పదార్థాల సరఫరా అధికం చెయ్యాలి.

వీటన్నింటి వలన వస్త్రాల వుత్పత్తి 19-24 శాతం, అల్లిక దుస్తులు 47 శాతం, పాదరక్షలు 18-23 శాతం పెంచడం సాధ్యం అవుతుంది.

ఆహార పదార్థాల వుత్పత్తి బాగా హెచ్చు అవుతుంది. 40-43 శాతం ఎక్కువ మాంసం, 47 శాతం ఎక్కువ చేపల వంటకాలు, 1970 లో కన్న 1975 లో వుత్పత్తి చేయాలని పథకం వేయబడింది. మాంస పదార్థాలా, మత్స్య పదార్థాలా వైవిధ్యం బాగా మెరుగు కావాలి.

సాంస్కృతిక, గృహావసర వస్తువుల వుత్పత్తి 80 శాతం పెరగాలని ముసాయిదా ఆదేశాలు విధిస్తున్నాయి. ప్రజల కోర్కెలను పూర్తిగా తీర్చడం కోసం ఈ వస్తువుల వుత్పత్తిని అదనంగా పెంచేందుకు గల అవకాశాలను గురించి, పంచవర్ష ప్రణాళికను రూపొందించేటప్పుడు సోవియట్ ప్రణాళికా సంఘమూ, యూనియను రిపబ్లిక్కులు, మంత్రిత్వ శాఖలు, విభాగాలు ఇంకా ఆలోచించడం అవసరం.

వాడకం వస్తువుల ఉత్పత్తిని అభివృద్ధి పరచడంలో భారీ పరిశ్రమ ఒక ముఖ్యమైన పాత్ర నిర్వహించాలి. 1970 లో కన్న 1975 లో దాని శాఖలన్నీ ఈ వస్తువుల వుత్పత్తిని ఇంచుమించు రెట్టింపు చేస్తాయి. ఇంజినీరింగ్ పరిశ్రమలో వుత్పత్తి 120 శాతం పెరుగుతుంది. స్థానిక పరిశ్రమలలో కూడ వాడకం వస్తువుల వుత్పత్తి బాగా పెరుగుతుంది.

అత్యధికమైన ఉత్పత్తీ, ఆధునిక శాస్త్ర, సాంకేతికాభివృద్ధీ మూలంగా పరిశ్రమల పనికి అధికాధికంగా మంచి వ్యవస్థీకరణ అవసరం అవుతుంది. మంత్రిత్వ శాఖలా, పరిశ్రమలా, పరిశ్రమ సంయోజనలా పని ఖచ్చితంగా, సమర్థవంతంగా జరగాలి. పరిశ్రమల మధ్య వస్తువుల నందచేయడానికి చేసుకొన్న అచ్చుబాట్లను పూర్తిగా నెరవేర్చాలి. జాతీయార్థిక వ్యవస్థకూ, ప్రజలకూ కావలసిన వానిని పూర్తిగా పరిశీలించాలి. ఈ అవసరాలలో కనిపించే మార్పుల్నిపట్టి ఉత్పత్తిని వేగంగా, అవసరానుగుణంగా మార్పు చేయాలి. కొంగ్రొత్త శాస్త్ర, సాంకేతిక విజయాలను ఉత్పత్తిలో ప్రవేశ పెట్టేందుకు దేశం యెడా, ప్రజల యెడా అత్యధిక బాధ్యత ప్రదర్శించాలి. ఇవన్నీ చాలా ముఖ్యమైనవి.

ఇదివరకటి లాగే ఇప్పుడు కూడా మన పరిశ్రమలలోని కార్మికులు, ఇంజినీర్లు, సాంకేతిక నిపుణులూ కొత్త యంత్రాలకోసం, చాలా పురోగమించిన ఉత్పత్తి వ్యవస్థీకరణ కోసం, శ్రామిక వుత్పాదక శక్తి కోసం చేస్తున్న ఈ కృషిలో అగ్రభాగానే వుంటారనే విశ్వాసం మనకుంది.

వ్యవసాయం. కమ్యూనిజం యొక్క పాదార్థిక, సాంకేతిక పునాదిలో బాగా పురోగమించిన వ్యవసాయం అవిభాజ్యమైన ఒక భాగం, ప్రజల జీవన స్థాయి వేగంగా పెరగడానికి అత్యవసరమైనదీను.

దిగువ విచ్చే ప్రధాన సూచికలు నూతన పంచవర్ష కాలంలో వ్యవసాయాభివృద్ధి ఎలా వుంటుందో తెలుపుతాయి:

| | 1971-75 సాలుసరి సగటు వుత్పత్తి | 9వ ప్రణాళికలో మొత్తం ఉత్పత్తి సాలుసరి సగటు పెరుగుదల |
|---|---|---|
| మొత్తం వ్యవసాయోత్పత్తి (వేల మిలియన్ల రూబుళ్లు) | 96-98 | 15.7-17.7 |
| ప్రధాన క్షేత్రోత్పత్తులు: | | |
| ధాన్యం (మిలియన్ల టన్నులు) | 195 | 27.5 |
| పత్తి (మిలియన్ల టన్నులు) | 6.75 | 0.65 |
| మాంసం (కళేబరాల బరువు మిలియన్ల టన్నులు) | 14.3 | 2.7 |
| పాలు (మిలియన్ల టన్నులు) | 92.3 | 11.8 |
| గుడ్లు (వేల మిలియన్లు) | 46.7 | 10.9 |
| ఉన్ని (వేల టన్నులు) | 464.0 | 67 |

గత అయిదేళ్ళలో కన్న 9 వ పంచవర్ష కాలంలో, సాలుసరి సగటున అదే సాగు భూములలో వ్యవసాయం 16-18 వేల మిలియన్ల రూబుళ్ల ఖరీదుచేసే అదనపు వుత్పత్తి చేయాలి.

ధాన్యం పంటను పెంచుతూండడమే ఇంకా కీలక కర్తవ్యం. అయిదేళ్ళ కాలంలో ధాన్యపు దిగుబడి హెక్టారుకు కనీసం నాలుగు సెంట్నర్లు ఎక్కువ కావాలి. ఇది అంత సులభం కాదు, గాని సాధ్యం మాత్రం అవును.

పశువుల సంఖ్యా, కోళ్ళూ మొదలైన వాని సంఖ్యా పెరగాలని, వాని ఉత్పాదకత పెరగాలని, మాంసం, ఉన్ని, పాలు, తదితర పదార్థాల వుత్పత్తి పెరగాలని ముసాయిదా ఆదేశాలు విధిస్తున్నాయి.

క్షేత్రాల పాదార్థిక, సాంకేతిక వనరులను విస్తరింప చేయడం, వాని ఉత్పత్తులను గరిష్ఠ స్థాయికి పెంచడమూ-ఇవి వ్యవసాయం ఇతోధికంగా పెరగాలంటే అతి ముఖ్యం.

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ 1970 జూలై విస్తృత సమావేశ నిర్ణయాలకు అనుగుణంగా వ్యవసాయానికి ట్రాక్టర్లను, మార్పిడి యంత్రాలను, లారీలను, క్షేత్ర పరికరాలను, ఇతర పాదార్థిక, సాంకేతిక సాధనాలను సమకూర్చేందుకు ముసాయిదా ఆదేశాలు ఏర్పాట్లు చేశాయి.

ఈ అయిదేళ్ళ కాలంలో వ్యవసాయ రంగంలో వున్న విద్యుదుత్పాదక వనరుల వుత్పత్తి 161 మిలియన్‌ల అశ్వ శక్తి పెరుగుతుంది. అంటే 50 శాతం పెరుగుతుంది. ట్రాక్టర్ల సంఖ్య 540 వేలు, అంటే 27 శాతం పెరుగుతుంది. వోల్గోగ్రాడ్, ఖార్కొవ్, మిన్‌స్క్, చెల్యాబిన్‌స్క్, అల్తాయ్‌లలోని ట్రాక్టరు కర్మాగారాలనుంచి, లెనిన్‌గ్రాడ్‌లోని కిరోవ్ ఇంజినీరింగ్ కర్మాగారం నుంచీ సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలకు శక్తివంతమైన ట్రాక్టర్లు, ఎంతో సమర్థవంతములయిన మార్పిడి యంత్రాలు మొదలయినవి అందుతాయి. కష్టతరములయిన పనుల యాంత్రికం చేయడానికీ, పశు సంవర్ధనంలో పనిని తేలిక పరచడానికీ యంత్రాలనూ, పరికరాలనూ సరఫరా చేయడం బాగా ఎక్కువ అవుతుంది.

శక్తివంతములయిన ఆధునిక యంత్రాలను జాగ్రత్తగా సరిగ్గా పని చేయించాలని వేరే చెప్పనక్కర లేదు. సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో ఇంజినీరింగ్ విషయాలలో, సాంకేతిక, ఉత్పత్తి వ్యవహారాలలో మరమ్మతులు వగైరా సేవా కార్యక్రమాలు సాగిస్తున్న సెల్ఖోజ్‌తెక్నికా సంస్థను బాగా మెరుగు పరచాలి.

వ్యవసాయంలో విద్యుచ్ఛక్తి వినియోగం 75 వేల మిలియన్‌ల కిలోవాట్ గంటలకు పెరుగుతుంది. అంటే రెట్టింపు అవుతుందన్న మాట.

పంటల మార్పిడి పద్ధతిని పూర్తిగా ప్రవేశ పెట్టడమూ, మేలురకం విత్తనాలనే వెయ్యడమూ—ఇవి నూతన పంచవర్ష ప్రణాళి ప్రధాన కర్తవ్యాల లోనివి.

పంటల యొక్క, పశు సంపద యొక్క ఉత్పత్తిని పెంచడంలో విత్తనం ఎన్నికకు ఎంతో ప్రముఖ పాత్ర వుంది. మంచి పంట యిచ్చే రకాలనూ, పశువులలో అధికోత్పత్తి కారకములయిన వంగడాలనూ జనుశ్శాస్త్రవేత్తలు రూపొందిస్తారని దేశం ఎదురు చూస్తూంది.

1975లో వ్యవసాయానికి 75 మిలియన్ టన్నుల రసాయనిక ఎరువుల్నీ, ఫాస్‌ఫేట్ ఆహారములనూ అందచేస్తారు. 1970 లో ఇచ్చినది 46 మిలియన్‌ల టన్నులు మాత్రమే. ఒక్కొక్క వాతావరణ ప్రాంతంలో, ఒక్కొక్క రకం నేలలో రసాయనిక ఎరువుల్ని ఏ విధంగా వుపయోగించడం అధిక లాభమో వానినే వుపయోగించాలి. అదే సమయంలో, మొక్కల సంరక్షణకై రాసాయనిక, జీవాత్మక సాధనాల వుత్పత్తినీ, వినియోగాన్నీ హెచ్చించడం అవసరం.

నల్లనేలలు కాని చోట్లన్నింటా చవిటి నేలలకు ప్రాథమిక చర్యగా సున్నం వేయడం పూర్తి కావాలి.

నూతన పంచవర్ష కాలంలో భూసార సంవర్ధనకై విస్తృత కార్యక్రమం కొనసాగించడానికి విశేష శ్రద్ధ చూపించాలి. నీటి పారుదలగల ప్రాంతాలలో బజారుకు తేగలిగేటంత ధాన్యం ఉత్పత్తి విధిగా చెయ్యగల కేంద్రాలు పెంపొందించడానికి శ్రద్ధ కనబరచాలి.

సాగునీటి పారుదల వ్యవస్థల నిర్మాణాన్ని వేగిరపరచాలి. వోల్గా ప్రాంతంలోనూ, ఉత్తర కాకసస్‌లోనూ, దక్షిణ ఉక్రైన్ లోనూ కనీసం ఒకటిన్నర మిల్లియన్ హెక్టార్లు, మధ్యాసియాలో 650,000 హెక్టార్లు మాగాణి భూమిని ఉపయోగంలో పెట్టడం కోసం ఇది అవసరం. ఊట ఎక్కువగా ఉండే ప్రాంతాల్లో, ఐదు మిల్లియన్ హెక్టార్ల భూమిలో నీరు తోడి వేయాలని ప్రణాళికలో తలపెట్టడం జరిగింది. 41 మిల్లియన్ హెక్టార్లకు పైగా పచ్చికబయళ్ళకు నీరు పెట్టడం జరుగుతుంది.

ప్రభుత్వ, సమిష్టి వ్యవసాయక్షేత్రాలు, మొత్తం దాదాపు 129 వేల మిల్లియన్ రూబుళ్లు వ్యవసాయ రంగంలో పెట్టుబడి పెట్టాలని నిర్దేశించడం జరిగింది. గడచిన ఐదేళ్ళలో పెట్టిన దానికన్నా యిది, 47 వేల మిల్లియన్ రూబుళ్లు ఎక్కువ. అంతేకాదు. వ్యవసాయ రంగానికి కావలసిన సరకులనూ, యంత్రాలనూ (రసాయనిక ఎరువులు, వ్యవసాయ యంత్రాలు, మిశ్రమ పశుగ్రాసాలు, విద్యుచ్ఛక్తి, సూక్ష్మజీవి సంబంధమైన, తదితర పరిశ్రమలు కూడా) సరఫరా చేసే పరిశ్రమల కింద పెట్టుబడులను కూడా యీ ఐదేళ్ళ కాలంలోనూ 11.5 వేల మిల్లియన్ రూబుళ్ళు పెంచి, మొత్తం 29.3 వేల మిల్లియన్ రూబుళ్ళు అయేలా చేయాలన్నది నిర్ణయం.

వ్యవసాయ రంగంలో శ్రమను యాంత్రికీకృతం చేసే స్థాయిని గణనీయంగా పెంచేందుకూ, దాని ఉత్పాదకశక్తిని అభివృద్ధి పరచేందుకూ, వ్యవసాయరంగ ఉత్పత్తిని, పారిశ్రామిక ప్రాతిపదికపై సాగించేందుకూ, ఇదంతా కూడా అవకాశం కలిగిస్తుంది.

పశుపోషణ రంగం పెరుగుదలను త్వరితం చేయడం కోసమూ, దాని సామర్థ్యాన్ని పెంచడం కోసమూ, సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాల్లో యాంత్రికీకృత పశుపోషణ కేంద్రాలను నిర్మించేందుకూ, పశు సంబంధ ఉత్పత్తులను పారిశ్రామిక పద్ధతులపై సాగించే పెద్ద పెద్ద ప్రభుత్వ, సమిష్టి వ్యవసాయక్షేత్ర సంస్థల సముదాయాలనూ, అంతర్ సమిష్టి వ్యవసాయక్షేత్ర సంస్థల సముదాయాలనూ, కోళ్లు, బాతులు మొదలైన వాటికి సంబంధించిన ఫ్యాక్టరీలనూ పట్టణాల సమీపంలో నెలకొల్పేందుకూ తగు ఏర్పాటు చేయడం జరిగింది.

*పశుగ్రాసం వనరులను పెంచడం,* పశు పోషణ రంగ అభివృద్ధికి సంబంధించిన తక్షణ కర్తవ్యాల్లో ఒకటి.

పశుగ్రాసం పంటలను పండించటంపట్ల వైఖరి మూలమట్టంగా మారాలి; ఈ పంటలకు మరింత ఎక్కువగా రసాయనిక ఎరువులను కేటాయించాలి; విత్తనాల సాగును శాస్త్రీయంగా సాగించాలి; ప్రకృతి సిద్ధమైన మేత మైదానాలను సమర్థవంతంగా ఉపయోగించు కోవాలి.

పంచవర్ష ప్రణాళికాంతం నాటికి ప్రభుత్వ పరిశ్రమలు, మిశ్రమ గ్రాసాల ఉత్పత్తిని కనీసం 30 మిల్లియన్ల టన్నులకు, వాటికి చేర్చే ప్రోటీన్ - విటమిన్ పౌష్టిక పదార్థాల ఉత్పత్తిని ఒక మిల్లియన్ టన్నులకు పెంచుతాయి. సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు ఉత్పత్తి చేసే ధాన్యాలనూ, ప్రభుత్వ పరిశ్రమలు సరఫరా చేసే ప్రోటీన్ - విటమిన్ పౌష్టిక పదార్థాలనూ ఉపయోగించి, ఆ క్షేత్రాల్లోనే మిశ్రమ గ్రాసాలను ఉత్పత్తి చేసే ఏర్పాట్లు జరగాలి.

గ్రామీణ ప్రజలు సొంతంగా ఉంచుకొనే పశువుల, పక్షుల సంఖ్యను పెంచుకొనే లాగా ప్రోత్సహించాలి (సహజంగానే యిది కొన్ని ఖచ్చితమైన పరిమితుల్లో వుండాలి); వారి పశువులకు గ్రాసాన్ని సరఫరా చేయాలి, మేత మైదానాల సౌకర్యం కలిగించాలి.

రాబోయే సంవత్సరాలకు స్థిరమైన సేకరణ పథకాలను రూపొందించాలి, తమ ముఖ్యమైన పంటలను, ప్రణాళిక లక్ష్యాలను మించి ప్రభుత్వానికి అమ్మే లాగా వ్యవసాయ క్షేత్రాలను ప్రోత్సహించాలి అన్న సూత్రాన్ని, 1965 మార్చిలో జరిగిన పార్టీ కేంద్రకమిటీ విస్తృత సమావేశం ఆమోదించింది. పూర్తిగా సార్థకమైన యీ సూత్రం, వచ్చే ఐదేళ్ళ కాలానికీ కూడా అమలు జరుగుతుంది. ఈ పరిస్థితుల్లో, ఉత్పత్తిని పెంచడం ద్వారానూ, ఉత్పత్తి ఖర్చులను తగ్గించడం ద్వారానూ వ్యవసాయ రంగ లాభదాయకతను మరింత పెంచాలి.

ఉత్పత్తి క్రమం, నిలవ చేయడం, రవాణాల్లోని అన్ని దశల్లోనూ, సరకుల తరుగులను మనం బాగా తగ్గించాలి; గిడ్డంగుల, రెఫ్రిజిరేటర్ల పరిమాణాలను పెద్దగా పెంచాలి. గిడ్డంగి సౌకర్యాలు మరింత మెరుగయేలా చూడాలి. మన ప్రజల శ్రమను వినియోగించి ఉత్పత్తి చేసే సరకుల్లో కొంతభాగం వాడకందారునకు అందకుండా ఉండే పరిస్థితిని అంతమొందించాలి.

వ్యవసాయ రంగంలో శ్రామిక ఉత్పాదక శక్తిని పెంచడం, ఎంతో ప్రాధాన్యం గల విషయం.

వ్యవసాయ రంగానికి నిర్దేశించిన కర్తవ్యాల నన్నిటినీ జయప్రదంగా నిర్వర్తించాలంటే, ఆర్థిక సాధనాలను మరింత చక్కగా ఉపయోగించుకోవాలి; ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల నన్నిటినీ, లాభనష్టాల ప్రాతిపదికపై పనిచేసే పద్ధతికి మళ్ళించడాన్ని పూర్తి చేయాలి. క్రమశిక్షణను పటిష్ఠం చేయడం, శ్రమ వ్యవస్థీకరణను మరింత మెరుగు పరచడం, ఆదాయాల పంపిణీ, లాభనష్టాల సూత్రాలను మరింత విస్తృతంగా వర్తింప

జేయడం, అఖిల యూనియన్ సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతుల 3 వ మహాసభ ఆమోదించిన సమిష్టి వ్యవసాయక్షేత్రాల నిబంధనావళి ననుసరించి, సమిష్టి వ్యవసాయక్షేత్ర ప్రజాస్వామ్యాన్ని పెంపొంద జేయడం, పటిష్ఠం చేయడం—సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లోని సాముదాయిక విభాగాల్లో ఉత్పత్తి మరింత పెరగడం చాలవరకు వీటిపై ఆధాపడి వుంది.

వ్యవసాయ రంగ పాదార్థిక, సాంకేతిక ప్రాతిపదికలో పెద్ద పెద్ద గుణాత్మక మార్పులు రావడంవల్ల, ఆ రంగం మేనేజిమెంటు వ్యవస్థపై కొత్త బాధ్యతలు పడుతున్నాయి. సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాల్లోని బాగా యాంత్రికీకృతమైన భారీ ఆర్థికవ్యవస్థ, ఉత్పత్తి విషయంలో, ఆధునిక పరిశ్రమలకు నానాటికి మరింత సన్నిహిత మవుతూంది. అందుచేత, ఆధునిక మేనేజిమెంటు రూపాలనూ, పద్ధతులనూ వ్యవసాయ రంగానికి వర్తింప జేయడమూ, మేనేజిమెంటు ప్రక్రియలను యాంత్రికీకృతమూ, స్వయంచాలకమూ చేసే సాధనాలను విస్తృతంగా ఉపయోగించడమూ, నిపుణులైన సిబ్బందిని తరిఫీదు చేయడమూ అవసర మవుతూంది.

వ్యవసాయరంగ అభివృద్ధి విషయంలో పార్టీ, ప్రభుత్వమూ నిర్ణయించిన కర్తవ్యాలను పూర్తి చేయడం పట్ల, యావన్మంది ప్రజలూ శ్రద్ధ వహించాలి. సమిష్టి వ్యవసాయ క్షేత్ర రైతులూ, ప్రభుత్వ వ్యవసాయక్షేత్ర కార్మికులూ, వ్యవసాయ రంగానికి కావలసిన పదార్థాలను, యంత్రాలను సరఫరా చేసే పరిశ్రమల్లో పనిచేస్తున్న వారూ, నిర్మాణ రంగంలో పని చేస్తున్నవారూ, పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలను జయప్రదంగా సాధించేందుకు సర్వశక్తులా కృషి చేస్తా రనేందుకు సందేహం లేదు.

*రవాణా, వార్తా ప్రసార సాధనాలు.* సామాజిక ఉత్పత్తి రంగ సామర్థ్యాన్ని పెంచాలంటే, రవాణా సాధనాలు, ఖచ్చితంగానూ, సమర్థతతోనూ పనిచేయడం తప్పనిసరిగా అవసరం. అయితే, రైల్వే, మోటారు రవాణా సౌకర్యాలు, జాతీయ ఆర్థిక వ్యవస్థ అవసరాలను నేటికీ, అందునా ముఖ్యంగా ఆకురాలు కాలంలోనూ, శీతాకాలంలోనూ, పూర్తిగా తీర్చడం లేదు.

వచ్చే ఐదేళ్ళలో జరగవలసిన రవాణా కార్యకలాపాల పరిమాణాన్ని ఈ దిగువ సూచికలు తెలియజేస్తున్నాయి:

| | 1971-75 లో పెరుగుదల వేగం |
|---|---|
| అన్నిరకాల సాధనాల ద్వారా జరిగే సరకు రవాణా | 32-35 శాతం |
| ఇందులో : | |
| రైల్వేల ద్వారా | 22 ,, |

| | 1971-75 లో పెరుగుదల వేగం |
|---|---|
| మోటారు (సాధారణ) వాహనాల ద్వారా | 60 శాతం |
| సముద్ర మార్గాల ద్వారా | 40 ,, |
| నదీ మార్గాల ద్వారా | 24 ,, |
| నూనె గొట్టాల ద్వారా | 100 శాతం పైగా |
| అన్ని రకాల సాధనాలద్వారా జరిగిన ప్రయాణీకుల రవాణా | 40 శాతం |
| ఇందులో విమానాల ద్వారా | 70 ,, |

కొత్త పంచవర్ష ప్రణాళికలో రవాణా కార్మికులు, సరకుల రవాణాను 32-35 శాతం పెంచవలసి వుంది. రైల్వేల ద్వారా జరిగే రవాణాలో యీ పెరుగుదలను, పూర్తిగా, శ్రామిక ఉత్పాదకశక్తిని పెంచడం ద్వారానే సాధించడం జరుగుతుంది.

మొత్తం సరకు రవాణాలో దాదాపు మూడింట రెండు వంతులు ప్రస్తుతం రైల్వేల ద్వారానే జరుగుతూంది. రైల్వేలను పురోగామి పద్ధతుల్లోకి మార్చడాన్ని పూర్తి చేసే కర్తవ్యాన్ని, గడచిన ఐదేళ్ళ కాలంలో మనం నిర్దేశించుకున్నాము. ఆ కర్తవ్యాన్ని పూర్తి చేయడం జరిగింది. ఈనాడు, మొత్తం గూడ్సు రైళ్ళలో 96.5 శాతాన్ని ఎలక్ట్రిక్, డీసిల్ యింజన్లు నడుపుతున్నవి. తొమ్మిదవ పంచవర్ష ప్రణాళికా కాలంలో మరొక 6000-7000 కిలోమీటర్ల రైలు మార్గాన్ని విద్యుదీకృతం చేయడం జరుగుతుంది. మరింత శక్తివంతమైన ఇంజన్లను తయారు చేస్తారు. దీనితో, రైళ్ళ బరువునూ, వేగాన్నీ పెంచడం సాధ్యమవుతుంది. యంత్ర నిర్మాణ పరిశ్రమల్లోని వారు, అంతా లోహంతో నిర్మించి, రోలర్ బేరింగులు అమర్చిన 420,000—430,000 గూడ్సు పెట్టెలను, ఎక్కువ సరకును మోసుకు పోగలవాటిని రైల్వేలకు అందజేయాలి.

అన్నిటికన్నా ఎక్కువ సరకు రవాణా జరిగే మార్గాల్లో, ఉదాహరణకు మాస్కో-కజాన్-స్వెర్డ్‌లోవ్‌స్క్, లెనిన్‌గ్రాద్-ముర్మాన్‌స్క్, త్సెలినోగ్రాద్-బార్నౌల్, కారగాందా-తాష్కెంట్ మార్గాల్లో జంట రైలు మార్గాలను నిర్మించడం జరుగుతుంది. స్టేషన్లలోని రైలు మార్గాలను అభివృద్ధి పరచడంపట్ల, రైళ్ళ రాకపోకలను నిర్వహించడంలో అధునాతన స్వయంచాలక, దూర నియంత్రణ సాధనాలను ప్రవేశపెట్టడం పట్ల ప్రత్యేక శ్రద్ధ వహించవలసి వుంది.

ఈ ఐదేళ్ళలోనూ కొన్ని కొత్త రైలు మార్గాలను నిర్మించాలని ప్రణాళికలో తలపెట్టడం జరిగింది. నూనె నిక్షేపాలున్న పశ్చిమ సైబీరియా ప్రాంతాలను, దేశ రైలు మార్గాలతో కలిపే 700 కిలోమీటర్ల త్యుమన్-సుర్గుత్ రైలు మార్గ నిర్మాణాన్నీ, మరొక కొత్త ప్రాంతం—ఉస్త్-ఇలిం జలవిద్యుత్కేంద్ర నిర్మాణం సాగుతున్న తూర్పు

సైబీరియా ప్రాంత అభివృద్ధిని త్వరితం చేసే అవకాశం కలిగించగల త్రైట్‌తౌవయ-ఉస్త్ - ఇలిం రైలుమార్గ నిర్మాణాన్నీ పూర్తి చేయడం ఈ ప్రాజెక్టుల్లో ఒకటి.

ప్రణాళికలో తలపెట్టిన ప్రాజెక్టుల నిర్మాణాన్ని పూర్తిచేయడం ఫలితంగా, ఈ పంచవర్ష ప్రణాళికా కాలం ముగిసేనాటికి జాతీయ ఆర్థిక రంగంలోని రవాణా అవసరాలను రైల్వేలు మరింత పూర్తిగా తీర్చగలుగుతాయి.

కేంద్రీకృతంగా జరిగే సరకు రవాణాను (ఇది చాల పొదుపైనది) మరింత ముమ్మరంగా సాగించడం, పరిశ్రమలకు మరింత మేలైన రవాణా సౌకర్యాలను కలిగించడం, తక్కువ దూరాలకు జరిగే రవాణా భారాన్ని కొంతవరకు రైల్వేలకు తొలగించడం—ఇవి *మోటారు రవాణా రంగం కర్తవ్యాలు*. ఇందుకోసం లారీల సంఖ్యను గణనీయంగా పెంచడం జరుగుతుంది.

ప్రజల ప్రయాణ సౌకర్యాలను మరింత మెరుగు పరచడం కోసం, పట్టణాల్లోని, గ్రామీణ ప్రాంతాల్లోని బస్సుల సంఖ్యను పెద్దగా పెంచడం జరుగుతుంది. టాక్సీల సంఖ్య, ప్రైవేటు మోటారుకార్ల సంఖ్య గణనీయంగా పెరుగుతుంది.

మోటారు రవాణా రంగం ఈ విధంగా పెద్దగా పెరగడంతో, నిపుణులైన డ్రైవర్లను చాలా మందిని తరిఫీదు చేయడమూ, మరమ్మత్తు, సర్వీసింగ్ సౌకర్యాలను పెంచడమూ, సర్విస్ స్టేషన్లను శాఖోపశాఖలుగా నిర్మించడమూ అవసర మవుతుంది.

గట్టి మోటారు రోడ్ల నిడివిని సుమారు 110,000 కిలోమీటర్లు పెంచడం జరుగుతుంది. ఇది కనీస అవసర మని భావిస్తున్నాము. స్థానిక వనరులను మరింత పెద్ద స్థాయిలో ఉపయోగించుకుని, ఫ్యాక్టరీల, సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాల చొరవను అన్నివిధాలా బలపరుస్తూ, యూనియన్ రిపబ్లిక్కుల మంత్రి మండలులూ, స్థానిక సోవియట్లూ, రోడ్ల నిర్మాణానికి అదనపు అవకాశాలను కనిపెట్టాలి. నిరపాయంగానూ, వేగంగానూ రాకపోకలు సాగించేందుకు సదుపాయాలు గల రోడ్లను నిర్మించడం ప్రత్యేకించి ముఖ్యం.

కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో, *వర్తక నౌకాదళం*, అంతర్జాతీయ నౌకా వ్యాపార రంగంలోనూ, జాతీయ ఆర్థిక వ్యవస్థ యొక్క ఆంతరంగిక అవసరాలను, ముఖ్యంగా ఉత్తర, దూరప్రాచ్య ప్రాంతాల్లోని అవసరాలను తీర్చడంలోనూ తన కార్యకలాపాలను విస్తృతం చేస్తుంది. వర్తక నౌకాదళానికి పెద్ద సంఖ్యలో కొత్త నౌకలను సమకూర్చడం జరుగుతుంది. అనేక ఓడ రేవులను, ముఖ్యంగా దూరప్రాచ్యం లోని వాటిని పెద్దవి చేసి, అత్యధునాతన యంత్ర పరికరాలను అమర్చాలి.

*నదీ నౌకాదళం* ముఖ్యంగా సరకులను, ప్రయాణీకులను రవాణా చేయడంలో మరింత పెద్ద పాత్రను నిర్వహించాలి. వోల్గా నదీ ప్రాంతాన్ని, వోల్గా-బాల్టిక్ జల మార్గాన్ని మరింత చక్కగా వుపయోగించుకోవడం ద్వారా, దేశంలోని యూరోపియను

ప్రాంతాల రైలు మార్గాలపై ఒత్తిడిని తగ్గించడం దీని కర్తవ్యం. సైబీరియాలోని మారు మూల ప్రాంతాలతో రవాణా సంబంధాలను మరింత మెరుగు పరచడం జరుగుతుంది. సముద్రంలోకి పోయే నౌకలు, నదులపై పయనించే పెద్ద నౌకలతో సహా అనేక కొత్త నౌకలను యీ నౌకాదళానికి సమకూర్చుతారు. ఆబ్, లీనా నదులపైని, వాయువ్య ప్రాంతం లోను, తదితర నదీ ప్రాంతాలలోను యాంత్రికీకృత వోడరేవులను కొత్తగా పనిలో పెడతారు.

నూనెను, నూనె వుప వుత్పత్తులను గొట్టాల ద్వారా రవాణా చేయడం యీ ఐదేళ్ళలోను రెట్టింపు పెరుగుతుంది. దీనివల్ల రైల్వేలపై వత్తిడి గణనీయంగా తగ్గు తుంది. గొట్టాల ద్వారా గ్యాసు రవాణా సుమారు 50 శాతం పెరుగుతుంది.

విమానాలలో ప్రయాణం చేయడం యీ ఐదేళ్ళలోను సుమారు 70 శాతం పెరుగుతుంది. అధునాతన జెట్ విమానాలను విమాన దళానికి సమకూర్చడం జరుగుతుంది; విమానాశ్రయాలలో ప్రయాణీకులకు సౌకర్యాలు మరింత మెరుగవుతాయి. విమానాలను నడపడంలోనూ, కిందికి దింపడంలోనూ స్వయంచాలక పద్ధతులను మరింత విస్తృతంగా ప్రవేశపెట్టడం జరుగుతుంది. భూగర్భ పరిశోధనలకూ, అన్వేషణలకూ, దుర్గమప్రాంతాల్లో సాగే నిర్మాణ ప్రాజెక్టుల వద్దా, వ్యవసాయ, అటవీ రంగాల్లోనూ, ఇతర రవాణా సౌకర్యా లకు దూరంగా ఉన్న ప్రాంతాలకు సరకులను చేరవేసేందుకూ విమానాలను మరింత ఎక్కువగా ఉపయోగించడం జరుగుతుంది.

రవాణా సౌకర్యాల వినియోగాన్ని బాగా పెంచడం, అన్నిరకాల రవాణా మార్గాల ఉమ్మడి కర్తవ్యం. ప్రభుత్వ ప్రణాళికా సంఘం, పాదార్థిక, సాంకేతిక సరఫరాల ప్రభుత్వ కమిటీ, యూనియన్ రిపబ్లిక్కుల మంత్రి మండలులు, మంత్రిత్వ శాఖలు, డిపార్టు మెంటులు—ఇవన్నీ కూడా, వాడకం దారుకూ, సరఫరా దారుకూ మధ్య ఉన్న రవాణా సంబంధాలను విమర్శనా దృష్టితో పరిశీలించాలి, హేతుబద్ధం కాని రవాణాను నివా రించాలి.

దేశంయొక్క సమగ్ర రవాణా వ్యవస్థలో భాగంగా ఉన్న అన్నిరకాల రవాణా మార్గాలనూ సమన్వయీకరించడం, వాటిలో రాకపోకలను సరిగా పంపిణీ చేయడం, రాక పోకల నియంత్రణను సమన్వయపరచడం—ఇవన్నీ కూడా అతి ముఖ్యం. సరకు ఎత్త డాన్ని, దింపడాన్ని యాంత్రికీకృతం చేయడం, కంటైనర్ల ద్వారా జరిగే రవాణా పరిమా ణాన్ని పెంచడం, అన్నిరకాల రవాణాశాఖల్లో పనిచేస్తూన్న వారి తక్షణ కర్తవ్యం.

వార్తా ప్రసార సౌకర్యాలపై జాతీయ ఆర్థిక వ్యవస్థా, ప్రజలూ పెడుతూన్న బాధ్యతలు స్థిరంగా పెరుగుతున్నాయి. సమగ్ర, స్వయంచాలక వార్తా ప్రసార వ్యవస్థా నిర్మాణ కృషి, తొమ్మిదవ పంచవర్ష ప్రణాళికా కాలంలో కూడా కొనసాగుతుంది. పట్టణాల మధ్య టెలిఫోన్ ఛానెల్స్ నిడివిని దాదాపు రెట్టింపు పెంచడమూ, పట్టణాల మధ్య వార్తా

ప్రసార సౌకర్యాలను పూర్తి స్వయంచాలకం, అర్ధ స్వయంచాలకం చేయడాన్ని విస్తరింపజేయవలసి ఉంటుంది.

పట్టణాల్లోనూ, ప్రభుత్వ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లోనూ స్థానిక టెలిఫోన్ సంబంధాలను మరింత అభివృద్ధి పరచి, మెరుగు పరచేందుకు ఏర్పాటు జరిగింది. తపాలా సౌకర్యాలను కూడా మరింత మెరుగు చేయడం జరుగుతుంది. ముఖ్యంగా టెలివిజన్, రేడియో ప్రసారాల రంగంలో చేయవలసిన కృషి ప్రత్యేకించి చాలా ఉంది. ఇందుకు అవసరమైన సాంకేతిక అవకాశాలన్నీ ఉన్నాయి. ముఖ్యంగా కృత్రిమ ఉపగ్రహాలను మరింత విస్తృతంగా ఉపయోగించుకోవడం జరుగుతుంది. ఇందువల్ల, టెలివిజన్ ప్రసారాలు, దాదాపు దేశంలోని అన్ని ప్రాంతాలకూ అందుతాయి.

*పరిశ్రమాదుల నిర్మాణం, ఉత్పాదక శక్తుల స్థాపన.* కొత్త పంచవర్ష ప్రణాళికలోని ఆర్థిక, సామాజిక కర్తవ్యాలను పూర్తి చేయాలంటే, పరిశ్రమాదుల నిర్మాణ కార్యక్రమాన్ని పెద్ద ఎత్తున అమలు జరపడం అవసరం. ఈ కార్యక్రమాన్ని జయప్రదంగా పూర్తిచేయడం పైనీ, పెట్టుబడులను ఎంత ఫలప్రదంగా ఉపయోగించు కుంటాము అన్నదాని పైనీ, మన పురోగమనం అనేక విధాల ఆధారపడి ఉంది.

1971-1975 మధ్య కాలంలో పెట్టుబడులు మొత్తం 500 వేల మిలియన్ రూబుళ్లు ఉంటాయి. అంటే, క్రితం ఐదేళ్ళ కాలంలో కన్నా దాదాపు 40 శాతం ఎక్కువ అన్న మాట.

మన పెట్టుబడుల విధానాన్ని, వచ్చే ఐదేళ్ళ కాలంలోని ప్రధాన కర్తవ్యాలు కూడా నిర్ణయిస్తున్నాయి. దీని ననుసరించి, జాతీయ ఆర్థిక వ్యవస్థలోని ఆయా శాఖల కింద వినియోగించే పెట్టుబడుల పరిమాణంలో ముఖ్యమైన మార్పులు ఉంటాయి. వ్యవసాయ రంగంలో ప్రభుత్వ పెట్టుబడులు 70 శాతానికి పైగానూ, ట్రాక్టర్ల, వ్యవసాయ యంత్రాల పరిశ్రమల్లో దాదాపు నూరు శాతం, రసాయన ఎరువుల, మొక్కలను కాపాడే రసాయనాల ఉత్పత్తిని పెంచేందుకు పెట్టే పెట్టుబడులను 60 శాతం, తేలిక రకం పరిశ్రమల్లో 90 శాతం, ఆహారం, మాంసం, పాడి పరిశ్రమల్లో 60 శాతం పెరుగుతాయి. మొత్తం మీద, జాతీయ ఆర్థిక వ్యవస్థలోని పెట్టుబడుల్లో సుమారు 30 శాతాన్ని వ్యవసాయ రంగాభివృద్ధి కిందా, ఆహార పదార్థాల, వాడకం సరకుల ఉత్పత్తి కిందా వినియోగించడం జరుగుతుంది.

ఈ ఐదేళ్ళ కాలంలోనూ, జాతీయ ఆర్థికరంగ శాఖలన్నిటిలోనూ ఉత్పాదక శక్తులను గణనీయంగా పెంచడం జరుగుతుంది. వచ్చే ఐదేళ్ళలో నిర్మించబోయే వాటన్నిటి లోకీ పెద్ద ప్రాజెక్టుల జాబితాను యివ్వడం కూడా సాధ్యం కాదు. ఎందువల్లనంటే, విద్యుత్కేంద్రాలను, లోహకార, రసాయన ఫ్యాక్టరీలనూ, తేలిక రకం, ఆహార పరిశ్రమలనూ నిర్మించాలని ప్రతి ఒక్క రిపబ్లిక్కూ తలపెడుతూంది. పంచవర్ష ప్రణాళికలను రూపొం

దించే క్రమంలో, కొత్త ప్రాజెక్టుల జాబితాను నిర్దిష్టం చేయడం, యూనియను రిపబ్లిక్కులతోనూ, ఆయా మంత్రిత్వ శాఖలతోనూ చర్చించడం జరుగుతుంది.

పెట్టుబడుల ఫలదాయకతను గరిష్ట స్థాయికి పెంచడం, వచ్చే ఐదేళ్ళలోని ప్రధాన ఆర్థిక కర్తవ్యాల్లో ఒకటి. పెట్టుబడులను హేతుబద్ధంగా ఉపయోగించేందుకు నిర్దిష్టమైన మార్గాలను ఎంపిక చేయాలంటే ఆర్థిక, ఇంజినియరింగ్ విషయాలను గురించి లోతైన అంచనాలు అవసరం. అత్యాధునికమైన సాంకేతిక పద్ధతులను ప్రవేశ పెట్టడం ద్వారానూ, యంత్రాలను ఆధునికం చేయడం ద్వారాను, కాలదోషం పట్టిపోయిన యంత్రాలను తొలగించి వాటి స్థానంలో కొత్త వాటిని అమర్చడం ద్వారానూ, ఉన్న ఫ్యాక్టరీల్లోనే ఉత్పాదక శక్తులను పెంచడం ద్వారానూ అత్యధిక ఫలితాలను సాధించడం జరుగుతుంది.

కొత్త సాంకేతిక సామగ్రిని సమకూర్చడంలోనూ, యంత్రాలను ఆధునికం చేయడంలోనూ, పని పరిస్థితులను మెరుగు పరచడంలోనూ, ఉత్పత్తి పెంపకం నిధులు పెద్ద పాత్రను నిర్వహించ నారంభించాయి. ఫ్యాక్టరీలూ, సంయుక్త పరిశ్రమలూ వీటికింద, గత ఐదేళ్ళల్లో ఖర్చు పెట్టిన దానికన్నా రెట్టింపు మొత్తాన్ని ఈ ఐదేళ్ళల్లోను ఖర్చు పెడతాయని ప్రాథమిక అంచనాలను బట్టి తేలుతూంది. ఈ పెంపకం నిధులనుండి పెట్టుబడులు పెట్టే ప్రాజెక్టులకు అవసరమైన పాదార్థిక మద్దతును ప్రణాళిక సమకూర్చుతుంది. ఫ్యాక్టరీలు, తమ సొంత ఉత్పత్తి పెంపకం నిధులతో తలపెట్టే నిర్మాణ పథకాలను పూర్తి చేయడంలో మంత్రిత్వ శాఖలు, డిపార్టుమెంటులూ తోడ్పడాలి; ఈ నిధులు, తలపెట్టిన పథకాలకు వినియోగమయేలా చూడాలి.

రూపకల్పన నాణ్యాన్ని మెరుగు పరచాలి; నిర్మాణ వ్యయాన్ని అంచనా కట్టడంలో పొరపాట్లు జరగడాన్ని అంతమొందించాలి. పెట్టుబడులను గురించిన పథకాలకూ, కంట్రాక్టరుకూ, కంట్రాక్టు యిచ్చిన వారికీ మధ్య ఉండే లాభనష్టాల మదింపు సంబంధాలకూ, అంచనాలు గట్టి పునాదిగా ఉండాలి. ఈ విషయంలో అంతా సక్రమంగా ఉండాలి.

పరిశ్రమాదుల నిర్మాణపథకాలను తయారుచేయడాన్నీ, రూపకల్పనలనూ, అంచనాలను తయారు చేయడాన్నీ మూల మట్టంగా మెరుగు పరచేందుకు సోవియట్ కమ్యూనిస్టు పార్టీ, కేంద్ర కమిటీ, ప్రభుత్వమూ కొన్ని నిర్ణయాలు చేశాయి. నిర్ణయాలను మరింత వేగంగా అమలు జరపాలి. మంత్రిత్వ శాఖలూ, డిపార్టుమెంటులూ, యూనియన్ రిపబ్లిక్కుల మంత్రి మండలులూ, సోవియట్ యూనియన్ ప్రభుత్వ నిర్మాణ కమిటీ, రూపకల్పన సమస్యలను మరింత లోతుగా పరిశీలించాలి; రూపకల్పన సంస్థలపై మరింత ఎక్కువ బాధ్యతలు మోపాలి; రూపకల్పన నాణ్యతను పెంచాలి.

మనకు చాల శక్తివంతమైన నిర్మాణ పరిశ్రమ ఉంది; పెద్దపెద్ద నిర్మాణ సంస్థలూ,

కూర్పు సంస్థలూ, నిపుణులైన సిబ్బందీ, అసంఖ్యాకమైన యంత్రాలూ, యంత్ర వ్యవస్థలూ ఉన్నాయి.

కంట్రాక్టు తీసుకునే సంస్థల ఉత్పత్తి ఆస్తులు గత ఐదేళ్ళలోనూ 83 శాతం పెరిగాయి; నిర్మాణ రంగంలో యంత్రం-మనిషి నిష్పత్తి 53 శాతం పెరిగింది. వచ్చే ఐదేళ్ళలోనూ, నిర్మాణ పరిశ్రమను మరింత అభివృద్ధి పరచేందుకు దాదాపు 15 వేల మిలియన్ రూబుళ్లు కేటాయించడం జరుగుతుంది. ఎనిమిదవ పంచవర్ష ప్రణాళికలో ఇందుకు కేటాయించినది 11.5 వేల మిలియన్ రూబుళ్లు.

నిర్మాణ కార్యక్రమాలు నిర్ణీత గడువులోనే ఖచ్చితంగా అమలు జరిగేలా చూడడం, ఈనాడు నిర్మాణ సంస్థల, యంత్రాలను పుచ్చుకునే సంస్థల, వాటిని సరఫరా చేసే సంస్థల ముఖ్య కర్తవ్యం. మహాశక్తివంతమూ, అధిక ఉత్పాదక శక్తిగలవీ అయిన యంత్రాలూ, సాంకేతిక సంస్థల సముదాయాలూ ఉన్న ఈనాడు, ఒకరోజు కలిసి రావడం అంటే, ముఖ్యమైన రకాల సరకులు మరింత ఎక్కువ ఉత్పత్తి కావడం అన్న మాట. ఉదాహరణకు, ఒక పెద్ద బ్లాస్టుఫర్నేస్ నిర్మాణానికి పట్టేకాలం ఒకరోజు తగ్గినట్లయితే, 8,000-10,000 టన్నుల దుక్క ఇనుము అదనంగా ఉత్పత్తి చేయడానికి వీలుకలుగుతుంది. 6,000,000 టన్నుల ఉత్పాదక శక్తిగల నూనె ఉత్పత్తి, శుద్ధి మిశ్రమ కేంద్రం ఒక్క రోజున ఉత్పత్తి చేసే సరకు విలువ ఐదు లక్షల రూబుళ్లు ఉంటుంది.

పెట్టుబడుల కేంద్రీకరణనూ, ఫ్యాక్టరీలు మొదలైనవి త్వర త్వరగా పని ప్రారంభించేలా చేయడం కోసం, ఏక కాలంలో అనేకం నిర్మాణం కాకుండా చూడడాన్నీ ముసాయిదా ఆదేశాలు తలపెట్టాయి.

పంచవర్ష ప్రణాళికను రూపొందించడంలోనూ, వార్షిక కర్తవ్యాలను నిర్ణయించడంలోనూ, పరిశ్రమాదుల నిర్మాణ కార్యక్రమం పాదార్థిక, సాంకేతిక వనరులకూ, నిర్మాణ సంస్థల శక్తిసామర్థ్యాలకూ అనుగుణంగా ఉండేలాగా చూడాలి.

నిర్మాణ పరిశ్రమలో నిరుడు ప్రారంభించిన ఆర్థిక సంస్కరణ, ఫ్యాక్టరీలూ, ప్రాజెక్టులూ, నిర్ణీత వ్యవధుల్లోనే పని ప్రారంభించేందుకు వీలుకలిగిస్తుంది. ఫ్యాక్టరీలను పనిలో పెట్టడం విషయంలో తమకు అప్పగించిన కర్తవ్యాలను పూర్తిచేయడం అన్న గీటురాయిని బట్టే, నిర్మాణ సంస్థల ద్రవ్య, ఆర్థిక కలాపాలను బేరీజు వేయడం జరుగుతూంది; వాటి ప్రోత్సాహక నిధుల పరిమాణం కూడా ప్రత్యక్షంగా దీని మీదనే ఆధారపడి ఉంది. నిర్మాణ సంస్థలన్నిటినీ కొత్త ప్రణాళికా రచనా, ఆర్థిక ప్రోత్సాహకాల విధానానికి మార్చడం పూర్తిచేసి, ప్రాజెక్టుల నిర్మాణం పూర్తి అయిన మీదటా, లేదా నిర్మాణ క్రమంలో దశలవారీగా లావాదేవీలను తేల్చుకునే పురోగామి పద్ధతులను చేపట్టడం, వచ్చే ఐదేళ్ళ కర్తవ్యాల్లో ఒకటి.

దాదాపుగా సిబ్బందినేమీ పెంచకుండానే, అంటే, శ్రామిక ఉత్పాదకశక్తిని పెంచడం

ద్వారానే, పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలను సాధించవలసిన బాధ్యత నిర్మాణ పరిశ్రమ కార్మికులపై ఉంది.

ఈ కర్తవ్యాన్ని నిర్వర్తించడం కోసం నిర్మాణం పని యాంత్రికీకరణ స్థాయిని పెంచాలి. కొత్త పంచవర్ష ప్రణాళిక కాలంలో నిర్మాణ సంస్థలకు 30-40 శాతం ఎక్కువగా మట్టి తవ్వకం యంత్రాలనూ, బుల్‌డోజర్లనూ, స్క్రేపర్లనూ, సంచార క్రేన్లనూ, సుమారు నూరు శాతం అధికంగా చిన్నచిన్న యంత్రాలనూ సరఫరా చేయడం జరుగుతుంది.

షిఫ్టులను పెంచడం, యంత్రాలు పని లేకుండా పడి ఉండే కాలాన్ని తగ్గించడం, సాంకేతిక సేవలను మరింత మెరుగుపరచడం—నిర్మాణ యంత్రాలను మరింత చక్కగా ఉపయోగించేందుకు యివి నిర్దిష్టమైన చర్యలు. మరామత్తుకు, యంత్రాలను చక్కగా ఉంచేందుకూ గల పునాదిని మరింత మెరుగుపరచడం, దాని సాంకేతిక స్థాయిని పెంచడం అవసరం.

నిర్మాణ స్థలాలవద్ద పని గంటల నష్టాన్ని తగ్గించడం, శ్రామిక ఉత్పాదకశక్తి పెరుగుదలకు ఒక పెద్ద మూలాధారం. నిర్మాణ కార్యకలాపాల వ్యవస్థీకరణలోని లోపాలే, ఈ నష్టానికి ముఖ్య కారణం.

పని వ్యవస్థీకరణలో పురోగామి పద్ధతులను అధ్యయనం చేయాలి, మరింత విస్తృత స్థాయిలో ఉపయోగించాలి. ప్రత్యేకించి, పెద్ద పెద్ద కర్మాగారాలను కూర్చడంలోనూ, నిర్మించడంలోనూ కన్వేయర్ పద్ధతిని గురించి శ్రద్ధగా ఆలోచించాలి. సోవియట్ దేశ కూర్పు, ప్రత్యేక నిర్మాణ మంత్రిత్వశాఖ, సోవియట్ దేశ నిర్మాణ మంత్రిత్వశాఖ ఈపద్ధతి గోర్కీ మోటారుకార్ల ఫ్యాక్టరీలో ప్రవేశ పెట్టాయి. ఇది శ్రద్ధగా గమనించ తగినది.

పారిశ్రామిక సరకుల స్థాయికి అభివృద్ధి చేసిన పోతసామగ్రిని, కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో ఇళ్లు మొదలైన వాటి నిర్మాణంలో మరింత ఎక్కువగా ఉపయోగించాలి. ఇళ్లు, తదితర కట్టడాలూ మరింత తేలికగా ఉండడం ప్రత్యేకించి ముఖ్యం.

పారిశ్రామిక భవనాల్లో తేలికగా ఉండే లోహనిర్మాణాలను ఉపయోగించేందుకు ఈనాడు అవకాశాలున్నాయి. అల్యూమినం నిర్మాణ సామగ్రిని ఉత్పత్తిచేసే కొత్త ఫ్యాక్టరీలు పని ప్రారంభించడంతో, వచ్చే ఐదేళ్ల కాలంలోనూ ఇందుకు గల అవకాశాలు మరింత పెరుగుతాయి.

నిర్మాణ సామగ్రి ఉత్పత్తి రంగవ్యవస్థా నిర్మాణంలో ముఖ్యమైన మార్పులు తేవడమూ, ఇళ్ళ కోసమూ, పారిశ్రామిక నిర్మాణాల కోసమూ, పైపూత సామగ్రి, ముందుగానే పోతపోసిన భాగాల, ఉష్ణాన్ని అట్టిపెట్టే సామగ్రి, మేలురకం పారిశుధ్య సామగ్రి ఉత్పత్తిని పెంచడమూ అవసరం.

సిమెంటు, గాజు, పలకలు, పైకప్పులకు తేలిక సామగ్రి, గోడలకు ఉపయోగించే

సామగ్రి ఉత్పత్తిని పెంచాలి. సిమెంటు ఉత్పత్తి 1975లో 122-127 మిల్లియన్ టన్నులకు పెరుగుతుంది.

ఇనుము, ఉక్కు పరిశ్రమ, నిర్మాణ సంస్థలకు గట్టి ఉక్కును, మరీ గట్టి ఉక్కునూ, హెచ్ బీములనూ, వంచి చేసిన వస్తువులనూ, ఉక్కు రేకులతో నేలను నిర్మించేందుకు కావలసిన సామగ్రిని సరఫరా చేస్తుంది.

నిర్మాణానికి కావలసిన కృత్రిమ సామగ్రి ఉత్పత్తిని రసాయన పరిశ్రమ గణనీయంగా పెంచాలి; దాని నాణ్యతను మరింత మెరుగు పరచాలి. నిర్మాణంలో ఉపయోగించే ఫోం పాలిస్టిరీన్, వార్నిష్‌లు, రంగులు, తుప్పును నిరోధించే పదార్థాల ఉత్పత్తిని బాగా పెంచాలి.

కలప, వడ్రంగం పరిశ్రమలు, మేలురకం కొయ్యసామగ్రి విషయంలో నిర్మాణ సంస్థల అవసరాలను మరింత పూర్తిగా తీర్చాలి.

స్థానికంగా తయారయే సరకులను తగినంతగా ఉత్పత్తి చేయకపోవడంవల్ల నిర్మాణ కార్యకలాపాలు ఆగిపోతున్నాయన్న విషయాన్ని తెలియచేయవలసి ఉంది. ఉత్పత్తి రంగంలోని ఈ శాఖను అభివృద్ధి పరచేందుకు యూనియన్ రిపబ్లిక్కుల మంత్రి మండలులూ, సోవియట్ యూనియన్ నిర్మాణ సామగ్రి పరిశ్రమ మంత్రిత్వశాఖా, తమ తమ ప్రణాళికల్లో తగు ఏర్పాట్లు చేయాలి.

నిర్మాణ కార్యకలాపాలు అతి ముమ్మరంగా సాగుతూన్న ప్రాంతాల్లో, ముఖ్యంగా దేశంలోని తూర్పు ప్రాంతాల్లో నిర్మాణాలకు కావలసిన చట్రాలను, వివిధ భాగాలను, కూర్పు యంత్రాలను ఉత్పత్తిచేసే ప్రత్యేక ఫ్యాక్టరీలను నిర్మించడం, నిర్మాణ మంత్రిత్వ శాఖల ముఖ్య కర్తవ్యాల్లో ఒకటి.

అత్యధిక స్థాయిలో ముందుగానే కూర్చిన యంత్రాల పూర్తి సెట్టులను, నిర్ణీత వ్యవధిలోగా అందజేయడంపై, నిర్మాణానికి పట్టే కాలాన్ని తగ్గించడం చాలా విధాల అధారపడి ఉంటుంది. ఈ సందర్భంలో, పూర్తి సాంకేతిక యంత్రాలను సరఫరా చేయడంలో రసాయన, నూనె ఇంజినియరింగ్ పరిశ్రమ మంత్రిత్వశాఖ అవలంబిస్తూన్న పద్ధతి ప్రశంసనీయం. నొవొమస్కోవ్‌స్క రసాయనిక ఫ్యాక్టరీలో, 180,000 టన్నుల ఉత్పాదకశక్తి గల డైల్యూటెడ్ నైట్రిక్ యాసిడ్ తయారీ యంత్రాన్ని, మామూలుగా పట్టే 23 మాసాల్లో కాకుండా 15 మాసాల్లోనే పనిలో పెట్టడం జరిగింది. ఈ యంత్రాన్ని అత్యున్నత పారిశ్రామిక స్థాయిలో ముందుగానే కూర్చడం జరిగింది. తక్కిన మంత్రిత్వ శాఖలు కూడా చక్కని ఈ ఆదర్శాన్ని అనుసరించాలి. 1971-75 లో నిర్మించబోయే ప్రాజెక్టులకు పూర్తియంత్రాల సెట్టులను సరఫరా చేసే పథకాలను, పంచవర్ష ప్రణాళికతో పాటు చేపట్టాలి.

ఈనాడు, దేశమంతటా నిర్మాణ స్థలాలవద్ద ఏడు మిల్లియన్ల మంది పని చేస్తు

న్నారు. నిర్మాణ కార్మికుల తరఫీదును మరింత విస్తృతం చేయాలనీ, వారికి గల అర్హతలను మరింత మెరుగు పరచాలనీ పార్టీ కేంద్రకమిటీ, ప్రభుత్వమూ ఒక నిర్ణయం చేశాయి. నిర్మాణ కార్మికుల వేతనాలను గణనీయంగా పెంచడం జరిగింది. వారికి మరింత ఎక్కువగా నివాస వసతిని కేటాయించారు. వారి దైనందిన జీవిత పరిస్థితులను మరింత మెరుగు పరుస్తున్నారు. నిర్మాణ కార్మికులు ఆ రంగంలోనే ఉండేలా చేసేందుకు ఇదంతా కూడా ప్రోత్సాహకం.

నిర్మాణ కార్మికులపైనీ, కూర్పు కార్మికులపైనీ ముఖ్యమైన కర్తవ్య భారం ఉంది. పంచవర్ష ప్రణాళికలో నిర్దేశించిన కార్యక్రమాన్ని పూర్తిచేసేందుకు వారు సర్వశక్తులా కృషి చేస్తారనే ఆశాభావాన్ని వ్యక్తం చేసేందుకు నన్ననుమతించండి.

* * *

అన్ని యూనియన్ రిపబ్లిక్కులూ పారిశ్రామికంగా మరింత అభివృద్ధి పొందేలాగా చేసేందుకు ఉత్పాదక శక్తులను సరిగా నెలకొల్పడమూ, లెనినిస్టు జాతుల విధానాన్ని అచంచలంగా అమలు జరపడం, సామాజికోత్పత్తి సామర్థ్యాన్ని పెంచేందుకు ముఖ్యంగా కావలసిన వాటిలో ఒకటి.

దేశంలోని యూరోపియన్ ప్రాంతపు ఉత్తరాది భాగంలోనూ, సైబీరియా, దూర ప్రాచ్యం, కజక్‌స్తాన్, మధ్యాసియాల్లోనూ అపారమైన సహజ సంపదల వినియోగాన్ని మరింత వేగిర పరచడం విషయంలో, కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో ఎంతో కృషి జరగవలసి ఉంది. పశ్చిమ సైబీరియాలో నూనె, గ్యాస్ నిక్షేపాల కేంద్రం, తూర్పు సైబీరియా లోని బ్రాత్‌స్క్-ఉస్త్-ఇలిం, సాయాన్ ప్రాంతాలు, తజిక్‌స్తాన్‌లోని నురెక్ మండలం వంటి అనేక కొత్త పారిశ్రామిక ప్రాంతాలనూ, దేశవ్యాపిత ప్రాధాన్యం గల కేంద్రాలనూ అభివృద్ధి పరచవలసి ఉంది. విద్యుచ్ఛక్తి ఎక్కువగా వినియోగమయే కొత్త పరిశ్రమల, ముఖ్యంగా అయోరహిత లోహకార పరిశ్రమల, రసాయన పరిశ్రమల నిర్మాణాన్ని తూర్పు ప్రాంతాల్లోనే కేంద్రీకరించడం జరుగుతూంది. ఆ ప్రాంతాల్లో ఇనుము, ఉక్కు పరిశ్రమల, కలప పరిశ్రమ అభివృద్ధి కూడా గణనీయంగా సాగుతూంది. వచ్చే ఐదేళ్ళ కాలం ముగిసే నాటికి ఉత్పత్తి అయే మొత్తం అల్యూమినంలో 70-73 శాతమూ, మొత్తం కాగితం గుజ్జు, అట్టలు, విద్యుచ్ఛక్తిని ఎక్కువగా వినియోగించి ఉత్పత్తి చేసే అనేక ఇతర సరకుల ఉత్పత్తిలో సుమారు మూడో వంతూ ఈ ప్రాంతాల్లో ఉత్పత్తి అవుతాయన్నది ప్రాథమిక అంచనా.

ఉత్తర, తూర్పు ప్రాంతాల అభివృద్ధికి తలపెట్టిన కార్యక్రమాన్ని పూర్తి చేయాలంటే, ఈ ప్రాంతాల్లో ఉన్న నిర్మాణ సంస్థలను మరింత మెరుగు పరచడమూ, కొత్త వాటిని నిర్మించడమూ అవసరం. నిపుణులైన పనివారు ఈ ప్రాంతాల్లో స్థిరపడేందుకు

ఆకర్షణ కలిగించడం కోసం నివాస గృహాల, సాముదాయిక, సాంస్కృతిక భవనాల నిర్మాణ వేగాలను పెంచేందుకు ప్రాధాన్యం ఇవ్వడానికి కావలసిన ఏర్పాట్లు జరగాలి.

కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో అన్ని యూనియన్ రిపబ్లిక్కుల్లోనూ పారిశ్రామిక, వ్యవసాయ రంగాలు మరింతగా అభివృద్ధి చెందుతాయి. చాలా రిపబ్లిక్కుల్లో పారిశ్రామికోత్పత్తి 40-50 శాతం, అంతకు పైగానూ పెరుగుతుంది. ప్రత్యేకంగా కేంద్రీకరించే పద్ధతి ద్వారా వ్యవసాయోత్పత్తిని పెంచే విషయంలో అన్ని యూనియన్ రిపబ్లిక్కులూ ముఖ్యమైన కర్తవ్యాలను నిర్వర్తించవలసి ఉంది.

ఉత్పాదక శక్తులను హేతుబద్ధంగా నెలకొల్పడంవల్ల ఆర్థికాభివృద్ధిని మరింత వేగవంతం చేసేందుకూ, యావద్దేశ ప్రయోజనాలను, యూనియన్ రిపబ్లిక్కుల, ఆర్థిక ప్రాంతాల అభివృద్ధి ప్రయోజనాలతో మరింత చక్కగానూ, పూర్తిగానూ జోడించేందుకూ అవకాశం కలుగుతుంది.

# IV

# మేనేజిమెంటునూ, ప్రణాళికా రచననూ మెరుగుపరచటం

కామ్రేడ్స్, గడచిన ఐదేళ్ళలోనూ, ఆర్థిక మేనేజిమెంటు రూపాలను, పద్ధతులను సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ అభివృద్ధిలోని ప్రస్తుత దశకు సరిపడేలా చేసేందుకు ఉద్దేశించిన ముఖ్యమైన చర్యలు తీసుకోవటం జరిగింది. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 23 వ మహాసభ నిర్ణయాల్లో ఆర్థికవ్యవస్థ యొక్క మేనేజిమెంటు పునర్వ్యవస్థీకరణ గమ్యాన్ని నిర్ధారణ చేయటం జరిగింది. పారిశ్రామిక రంగ మేనేజిమెంటును మెరుగు పరచడం: ప్రణాళికా రచనను పెంపొందించటం, "పారిశ్రామికోత్పత్తిలో ఆర్థిక ప్రోత్సాహాన్ని ముమ్మరం గావించడం గురించి" అన్న తీర్మానంలో 1965 సెప్టెంబర్‌లో జరిగిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ విస్తృత సమావేశం, యావత్తు ఆర్థిక యంత్రాంగాన్నీ మెరుగు పరచేందుకు కొన్ని నిర్దిష్ట చర్యలను నిర్ణయించింది. వీటిని 23వ మహాసభ ఆమోదించింది. సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ మేనేజిమెంటుకు సంబంధించిన లెనినిస్టు సూత్రాలను మరింతగా అభివృద్ధి పరుస్తున్న ఆర్థిక సంస్కరణకు ఈ చర్యలన్నీ నాంది పలికాయి.

ప్రణాళికా రచనకూ, ప్రోత్సాహ కల్పనకూ సంబంధించిన కొత్తవ్యవస్థ, ఉత్పత్తి ఫలదాయకత మీద గొప్ప సత్ ప్రభావం కలిగించిందని 8వ పంచవర్ష ప్రణాళిక ఫలితాలు తెలియజేస్తున్నవి.

తమ కృషివల్ల చేకూరే ఆర్థిక ఫలితాలపట్ల పరిశ్రమాది సంస్థల సిబ్బంది ఆసక్తి బాగా పెరగటమూ, మేనేజిమెంటు సిబ్బంది మరింత చురుకుగా పనిచేయటమూ, ఉత్పత్తికి సంబంధించిన ఆర్థిక సమస్యలను పరిష్కరించటంలో శ్రామిక ప్రజలు అధికాధికంగా పాల్గొనటమూ మనం గమనించాం.

అయినప్పటికీ, కొన్ని మంత్రిత్వ శాఖలు యిప్పటికీ గూడ ఉత్పత్తి మేనేజిమెంటుకు సంబంధించిన కొత్త పద్ధతులను సరిగా ఉపయోగించుకోవటం లేదని చెప్పక తప్పదు. లాభనష్టాల ప్రాతిపదికపై పనిచేసే సంస్థల హక్కులను తరచు దెబ్బతీయటం జరుగుతూ వుంది; ఆర్థిక పద్ధతులను తోసిపుచ్చి, పరిపాలనా పద్ధతులను ప్రవేశపెట్టటం జరుగుతూ వుంది. అదేసమయంలో ఆర్థిక సంస్కరణకు సంబంధించిన ఏయే అంశాలను మరింత విపులీకరించడమూ, వివరించడమూ అవసరమో అనుభవంలో స్పష్టపడింది. ప్రణాళికా రచననూ, ప్రోత్సాహక పద్ధతులనూ, అంటే ఫ్యాక్టరీల, సంయుక్త పరిశ్రమల కృషికి విలువ గట్టేందుకు ఉపయోగించే గీటురాళ్లను మరింతగా మెరుగు పరచవలసి వుందని స్పష్టమే. సత్వర శాస్త్ర, సాంకేతిక ప్రగతి విషయంలో, ఉత్పత్తుల నాణ్యతను పెంచే విషయంలో, శ్రామిక ఉత్పాదకశక్తిని అధికంచేసే విషయంలో మరింత భారీ ప్రణాళికా విధులను నెరవేర్చడంపట్ల ఫ్యాక్టరీల, సంయుక్తపరిశ్రమల, మంత్రిత్వశాఖల ఆసక్తిని

పెంచే విషయంలో సంస్కరణ యొక్క ప్రభావాన్ని యినుమడింప జేసేందుకు యిది అవసరం. ఇదే, ఈనాడు ప్రధాన విషయం.

ఆర్థిక సంస్కరణ అన్నది ఒకే ఒక చర్యకాదు. సోషలిస్టు ఉత్పత్తి పద్ధతిలో గల లాభా లన్నిటినీ గరిష్ట స్థాయిలో ఉపయోగించు కోవడానికి ఉద్దేశించిన ఆర్థిక మేనేజిమెంటును మెరుగుపరచే ఒక క్రమం అది.

పాదార్థిక ఉత్పత్తికి సంబంధించిన అన్ని రంగాల్లోనూ, సేవా సౌకర్యాల రంగంలోనూ, లాభనష్టాల సూత్రంపై ఆధారపడి పని చేస్తున్న అన్ని ఫ్యాక్టరీల్లోనూ, సంస్థల్లోనూ ప్రణాళికా, ప్రోత్సాహకాల కొత్తపద్ధతికి పరివర్తనను కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో మనం పూర్తి చేయాలి. లభించిన అనుభవాన్ని ఆధారం చేసుకొని సంస్కరణకు సంబంధించిన గత దశ అనుభవాన్ని సమీక్షించడమూ, దాన్ని మరింతగా అభివృద్ధి పరచేందుకు ప్రతిపాదనలు రూపొందించటమూ అవసరం.

సోవియట్ ప్రణాళికా రచన సాధించిన ఫలితాలు ప్రపంచ వ్యాప్తంగా గుర్తింపు పొందాయి. కొత్త సామాజిక-ఆర్థిక వ్యవస్థ రూపుగొంటున్న పరిస్థితుల్లో, ఆవిర్భవించిన సోషలిస్టు ప్రణాళికా రచనా వ్యవస్థ, సామాజిక-ఆర్థిక ప్రగతి అవసరాలకు అనుగుణంగా, స్థిరంగా అభివృద్ధి చెందుతూ వుంది.

అంతర్ శాఖ ప్రణాళికా రచనను మెరుగుపరచ వలసిన అవసరం ఏర్పడింది. ఆర్థికవ్యవస్థలోని అనేక శాఖలతో సంబంధంగల ప్రధానమైన అనేక ఆర్థిక సమస్యలను పరిష్కరించవలసి వున్న కారణంగా దాని ప్రాముఖ్యం పెరుగుతూ వుంది. మోటారు వాహనాల పరిశ్రమ ఉదాహరణను పేర్కొంటాను. మోటారు వాహనాల తయారీ ప్రణాళికా బద్ధంగా పెరగటమన్నది, ఆ పరిశ్రమకు సంబంధించిన శాఖల అభివృద్ధిని మాత్రమే గాక, రోడ్ల నిర్మాణంయొక్క, శాఖోపశాఖలుగా విస్తరించిన సర్వీసు కేంద్రాలయొక్క, పట్టణ అభివృద్ధి ప్రణాళికా రచనలయొక్క అభివృద్ధిని కూడా నిర్ధారణ చేస్తూ వుంది. వేరు మాటల్లో చెపాలంటే "ఊర్ధ్వముఖంగా" తయారుచేసిన సమగ్ర పథకాలు మాత్రమే గాక, "సమానాంతరంగా" రూపొందించిన పథకాలు గూడ మనకు అవసర మౌతున్నవి.

సమగ్రమైన ఆర్థిక సమస్యలను పరిష్కరించేందుకు దీర్ఘకాలిక అంచనాలు ఎంతో ముఖ్యం. అవి దీర్ఘకాలిక ప్రణాళికల శాస్త్రీయ ఔచిత్యాన్ని యినుమడింప జేయటంలో తప్పకుండా ఒక ముఖ్యపాత్ర వహించుతాయి. ఇటీవలనే మన పరిశోధనా కేంద్రాలు, శాస్త్ర, సాంకేతిక విషయాల కమిటీ, ప్రభుత్వ ప్రణాళికా కమిటీ, రసాణా, నూనె, పెట్రో రసాయన పరిశ్రమల అభివృద్ధి గురించీ, భూమి అభివృద్ధి, వ్యవసాయ రంగంలో రసాయనీకరణ గురించీ దీర్ఘకాలిక అంచనాలు తయారు చేశాయి; దేశంలో యింధనాల పరిస్థితి గురించి ఒక అంచనా వేశాయి. వీటిని సోవియట్ యూనియన్ మంత్రిమండలి పరిశీలించింది. ఉత్పాదక శక్తుల స్థల నిర్దేశనకు సంబంధించిన ఒక సార్వత్రిక పథకాన్ని మన

మిప్పుడు అధ్యయనం చేస్తున్నాం. దీన్ని ఆధారం చేసుకొని, సోవియట్ దేశ దీర్ఘకాలిక యొక్క ఆర్థికాభివృద్ధి ప్రణాళిక గురించి, అంటే ఉజ్జాయింపుగా, 10 లేదా 15 సంవత్స రాల కాలానికి వర్తించే, ప్రణాళికా రచనా వ్యవస్థలో ప్రముఖస్థానాన్ని అలంకరించే ఒక ప్రణాళిక గురించి మనం సరైన వైఖరిని ఏర్పరచుకో గలుగుతాం.

శాస్త్ర, సాంకేతిక ప్రగతి సమస్యల గురించిన ఒక సమగ్ర అధ్యయనం మనకు అవసరం. జాతీయ ఆర్థిక ప్రణాళికా సూచికలను మెరుగు పరచాలి. ఉత్పత్తి సాంకేతిక స్థాయిని పెంచటం, శాస్త్ర, సాంకేతిక రంగాలు సాధించిన ఫలితా లన్నిటినీ సత్వరం వినియోగించుకోవటం, ఉత్పత్తులను క్రమ పద్ధతిలో ఆధునికం చేయటం ఆర్థిక రంగ విభాగాలన్నిటి గమ్యంగా వుండాలి. నూతన సాంకేతిక ప్రక్రియలకు సంబంధించిన పథకా లన్నీ మొత్తం జాతీయార్థిక ప్రణాళికలో అంగాగికంగా అంతర్భాగం కావాలి. కాని అదే సమయంలో జాతీయార్థిక ప్రణాళికలోని అన్ని విభాగాలూ శాస్త్ర, సాంకేతిక ప్రగతిపై ఆధారపడాలి.

ప్రణాళికా రచనలో ఉపయోగించే, సాంకేతిక - ఆర్థిక ప్రమాణాల వ్యవస్థను మరింతగా విపులీకరించాలి. ముడి పదార్థాలు మొదలయిన సరకుల వినిమయం విషయం లోనూ, యింధనము, విద్యుచ్ఛక్తి, శ్రమ శక్తి వినిమయం విషయంలోనూ, మనకు శాస్త్రీయమైన ప్రమాణాలు వుండాలి. ఈ ప్రమాణాలను, వాటికి సాంకేతిక ప్రగతి ఫలితా లతో ప్రత్యక్ష సంబంధం ఉండేలా చూచుకొంటూ, ప్రణాళికా సంస్థలు సకాలంలో సమీ క్షించు కోవాలి.

దీర్ఘకాలిక ప్రణాళికలకు మరింత పెద్ద పాత్ర, సామాజిక అవసరాల గురించీ, వినిమయదారుల అవసరాల గురించీ కూలంకషమయిన అధ్యయనం, పాదార్థిక, మానవ శక్తి, ద్రవ్య వనరుల వినియోగంలో అధికాధిక ప్రమాణాల ఆధారంగా ఆర్థికవ్యవస్థ యొక్క అన్ని శాఖల సమతూకమైన అభివృద్ధి, దేశ ఆర్థికాభివృద్ధితో సన్నిహితంగా ముడిపడి వుండేలా సామాజిక సమస్యల, శాస్త్ర, సాంకేతిక సమస్యల ప్రగాఢ అధ్య యనం—ఇవీ ప్రణాళికా రచన యొక్క శాస్త్రీయ స్థాయిని మరింతగా పెంచేందుకు అనుసరించవలసిన ప్రధాన మార్గాలు. ఈ ప్రాతిపదిక పైననే మన ప్రణాళికలకూ, ఆర్థిక ప్రమాణాలకూ అధిక సుస్థిరత చేకూర్చగలం; అత్యున్నతమైన ప్రణాళికా కర్తవ్యాల విషయమై ఫ్యాక్టరీలు, సంయుక్త పరిశ్రమలూ ఆసక్తి చూపేలా చేయగలం.

వేరు వేరు ఫ్యాక్టరీల, ఉత్పత్తి శాఖల కృషిని సమన్వయపరచే ప్రణాళికలను పూర్తి చేసేందుకూ, ఆ శాఖల అభివృద్ధికి గల దీర్ఘకాలిక అవకాశాలకూ గూడ, ప్రభుత్వ క్రమ శిక్షణను మొత్తంగా కట్టు దిట్టం చేయటం అవసరం. ప్రణాళికా కర్తవ్యా లన్నిటినీ సకాలంలో పూర్తిచేసే విషయంలో ప్రతి ఒక్క మంత్రిత్వ శాఖ యొక్క, సంయుక్త పరిశ్రమ యొక్క, ఫ్యాక్టరీ యొక్క, కార్మికుల సమిష్టి సంస్థల యొక్క బాధ్యతను

పెంచటం అవసరం. లక్ష్యాలు నెరవేరడాన్ని తనిఖీ చేసే సమర్థవంతమైన వ్యవస్థ, క్రమ శిక్షణను కట్టుదిట్టం చేయటంలోనూ, తన పని విషయంలో ప్రతి ఒక్క కార్మికుని యొక్క, అధికారియొక్క బాధ్యతను పెంచటంలోనూ ముఖ్య పాత్ర వహిస్తుంది. స్థానిక పార్టీ, ప్రభుత్వ సంస్థలూ, లక్షలాది కార్యకర్తలు గలిగిన ప్రజల నియంత్రణాధికార సంస్థలూ, ప్రభుత్వ గణాంక సంస్థలూ, తమ కార్యకలాపాల్లో పార్టీ, ప్రభుత్వ నిర్ణయాలనూ, ఆదేశాలనూ పూర్తి చేయడంపై ఒక పద్ధతి ప్రకారం తనిఖీచేసే పనికి ప్రాధాన్యమివ్వాలి.

ప్రణాళికలను పూర్తి చేయటం జరిగిందీ లేనిదీ తనిఖీ చేసే పనిపట్ల ప్రణాళికా సంస్థలు తగినంత శ్రద్ధ వహించడంలేదని గుర్తు పెట్టుకోవాలి. ఎగుడు దిగుళ్లు ఏర్పడకుండా నివారించేందుకూ, ప్రణాళికలు ఖచ్చితంగా పూర్తి అయ్యేలా చేసేందుకూ, ఆంతరంగిక శక్తి, స్తోమతలు సాధ్యమైనంత పూర్తిగా ఉపయోగించబడేలా చేసేందుకూ అవి సకాలంలో చర్యలు తీసుకోవాలి.

సరకు - డబ్బు సంబంధాలను మెరుగు పరచేందుకై, ఆర్థిక సాధనాలను చాకచక్యంతో వినియోగించుకో వలసిన అవసరాన్ని కామ్రేడ్ బ్రెజ్నెవ్ నివేదిక మన దృష్టికి తెస్తూ వుంది. ఆదేశపూర్వక ప్రణాళికా రచన ప్రధానమైన, నిర్ణయాత్మకమైన అంశమనీ, జాతీయార్థిక వ్యవస్థకు ప్రణాళిక బద్ధమైన సారథ్యాన్ని పటిష్టం చేసేందుకూ, లాభనష్టాల ప్రాతిపదికపై పని చేస్తున్న ఫ్యాక్టరీల, సంయుక్త పరిశ్రమల చొరవను ప్రోత్సహించేందుకూ సరకు - డబ్బు సంబంధాలను వర్తింప జేయవచ్చుననీ, వర్తింప జేయాలనీ, పార్టీ కేంద్రకమిటీ, సోవియట్ ప్రభుత్వమూ అభిప్రాయ పడుతున్నవి. మన దేశంలో సరకు - డబ్బు సంబంధాలు ఒక కొత్త, సోషలిస్టు అంతస్సారం కలిగి వున్నాయి. ప్రభుత్వం నిర్వహించే కేంద్రీకృత ప్రణాళికా రచన యొక్క సారథ్య పాత్ర స్థానంలో మార్కెట్ నియమాన్ని ప్రవేశ పెట్టే తప్పుడు భావనల నన్నిటినీ మనం నిరాకరించటం సహేతుకమే.

వ్యష్టి, సమిష్టి, ప్రయోజనాల మధ్య, కార్మికుల వ్యష్టి ప్రయోజనాల మధ్య, ఒక సంస్థ ప్రయోజనాలకూ యావత్తు సమాజ ప్రయోజనాలకూ మధ్య మరింత సంపూర్ణమైన పొందిక ఏర్పరచటం, సమాజం కోసం పని చేయటం తమ పరమ విధి అనే, జీవన ప్రమాణాన్ని పెంచటంలో అది ప్రధాన అంశమనే దృక్పథాన్ని ప్రజలకు నూరిపోసేందుకు అవసరం. ఈ విధంగా చేసేటప్పుడు, శాస్త్ర, సాంకేతిక రంగాలలో సాధించబడిన విజయాలను విస్తారంగా ఉపయోగించి నందువల్లా, ఫ్యాక్టరీల పనికి సంబంధించిన నాణ్యతా సూచికలను మెరుగు పరచి నందువల్లా చేకూరే తక్షణ ఫలితాలపట్ల మాత్రమే గాక, దీర్ఘకాలిక ఫలితాల పట్ల కూడా ఫ్యాక్టరీల, సంయుక్త పరిశ్రమల, మంత్రిత్వ శాఖల సిబ్బంది ఆసక్తిని పెంచటం ముఖ్యం. పాదార్థిక ప్రోత్సాహకాల విధానాన్ని పంచవర్ష ప్రణాళికా

కర్తవ్యాల పరిపూర్తితో నేరుగా ముడిపెట్టడం ద్వారా, అన్ని ఆర్థిక సాధనాల యితోధికాభి వృద్ధిని పై లక్ష్యాలకు లోబడి వుండేలా చేయాలి.

జాతీయార్థిక వ్యవస్థలో లాభానికి మరింత పెద్ద పాత్ర వుండటం, లాభనష్టాల సూత్రాల్ని పటిష్టం చేయటంపైన, అభివృద్ధి పరచటంపైనా ఆధార పడినా, నూతన ఆర్థిక ప్రోద్భల విధానంలో గర్భితం. లాభాన్నీ, లాభదాయకతనూ, మనం ఉత్పత్తి ఫలదాయకతకు ముఖ్య సూచికలుగా పరిగణిస్తున్నాం. అదే సమయంలో, లాభం అన్నది, లాభనష్టాల పద్ధతిపై పనిచేస్తున్న ఫ్యాక్టరీల, సంయుక్త పరిశ్రమల నిధులకు ప్రధాన మైన వనరుగా మాత్రమే గాక, ప్రభుత్వ బడ్జెట్ ఆదాయానికి అన్నిటికన్నా ముఖ్య వనరుగా కూడా వున్నది.

లాభాన్ని ఏ విధంగా, ఏ మార్గాల ద్వారా, ఎలాంటి పరిస్థితుల్లో పెంచడం జరుగు తుంది అనే విషయాన్ని సోషలిస్టు సమాజం నిర్లక్ష్యం చేయటం లేదన్నది నిశ్చయం. ఉత్పత్తి ఫలదాయకతను పెంచటం, ఉత్పత్తి ఖర్చులను తగ్గించటం, శ్రామిక ఉత్పాదక శక్తిని పెంచటం—ఇదే లాభాన్ని పెంచే మన పద్ధతి. ప్రభుత్వం నిర్ణయించిన ధరలను నిర్లక్ష్యం చేయటం ద్వారా, వాటిని పెంచటం ద్వారా, సరకుల నిర్ణీత వైవిధ్యాన్నీ, ప్రమా ణాలనూ అతిక్రమించటం ద్వారా, లాభం సంపాదించేందుకు చేసే ప్రయత్నాలన్నీ కూడా దేశ వ్యతిరేక చర్యలే. ధరల విషయంలో ప్రభుత్వం నిర్ణయించిన క్రమశిక్షణను ఖచ్చి తంగా పాటించడం పట్ల, సరకుల వైవిధ్యం విషయంలో ప్రణాళికా లక్ష్యాలను పూర్తి చేయడంపట్ల మంత్రిత్వశాఖల, డిపార్టుమెంటుల, సంయుక్త పరిశ్రమల బాధ్యతనూ, ఫ్యాక్టరీ అధికారుల బాధ్యతనూ, ధరలను నిర్ణయించే సంస్థల బాధ్యతనూ మనం పెంచాలి.

అదే సమయంలో, లాభాల పంపిణీని మెరుగు పరచడాన్నీ, పదార్థాలనూ, ద్రవ్య, శ్రామిక వనరులనూ మరింత ఫలదాయకంగా వుపయోగించే విషయంలో ఫ్యాక్టరీల ఆసక్తిని యినుమడింపజేయడాన్నీ కొనసాగించాలి.

1970లో పారిశ్రామిక సంస్థలు తమ అభివృద్ధి నిధులకు 3.6 వేల మిలియన్ రూబుళ్ళను, సామాజిక, సాంస్కృతిక చర్యలకూ, నివాస వసతి అభివృద్ధికి సంబం ధించిన నిధులకు 1.4 వేల మిలియన్ రూబుళ్ళనూ, పాదార్థిక ప్రోత్సాహక నిధులకు 4 వేల మిలియన్ రూబుళ్ళనూ సమకూర్చుకో గలిగాయి. ఈ నిధులకు చేర్చిన మొత్తం సొమ్ము 9 వేల మిలియన్ రూబుళ్లు. ఈ నిధులతో అనేక సంస్థలు ఉత్పత్తిని ఆధునికం చేయచడమూ, తమ కార్మికుల, ఉద్యోగుల గృహవసతిని మెరుగు పరచడమూ, మరిన్ని శిశు పాఠశాలలను, శిశు పోషణాలయాలను, సాంస్కృతిక సంస్థలను నిర్మించటమూ విస్తా రంగా చేయగలిగాయి.

ఉత్పత్తిని మెరుగుపరచడంపట్ల సమిష్టి సంస్థల భౌతిక ఆసక్తిని యినుమడింపజేయ

టంలో పాదార్థిక ప్రోత్సాహక నిధులు అధికాధిక పాత్ర వహిస్తున్నవి. పరిశ్రమల రంగంలో పనిచేస్తున్న కార్మికులకూ, ఉద్యోగులకూ గత ఐదేళ్ళలో పెరిగిన సగటు వేతనాల మొత్తంలో నాలుగోవంతుకు పైగా ఈ నిధుల్లోనుంచే లభించింది. కొత్త విధానానికి మారిన సంస్థల్లో ఆయా సంవత్సరాల్లో సాధించిన ఫలితాలను బట్టి పాదార్థిక ప్రోత్సాహక నిధుల్లో నుంచి బోనసులు చెల్లించటం ఒక ఆచారమైంది. ఈ విధంగా చెల్లించే మొత్తం, మధ్యలో నిలిచిపోకుండా చేసిన సర్వీసు కాలాన్నీ, క్రమశిక్షణనూ, పనిలో రికార్డునూ బట్టి వుంటుంది. ఈ ప్రోత్సాహకాల పథకం శ్రామిక ఉత్పాదక శక్తిని పెంచుతుంది, సిబ్బంది అస్థిరతను తగ్గిస్తుంది. శ్రామిక క్రమశిక్షణను మెరుగు పరుస్తుంది. ఈ విషయం అనుభవంలో నిరూపితమైంది.

లాభనష్టాల ప్రాతిపదికపై పనిచేసే ఫ్యాక్టరీల ఆర్జనల్లోనుంచి వాటి ప్రోద్బల నిధులు లభిస్తాయి. ఈ నిధులను హేతుబద్ధంగా వినియోగించే విషయంపై సర్వవ్యాపిత చర్చల్లో కార్మికుల, ఉద్యోగుల ఆక్టివ్‌లు తప్పక పాల్గొనాలి. అదే సమయంలో ఫ్యాక్టరీల ప్రోద్బల నిధులను రూపొందించే, పంపిణీచేసే విధానాన్ని నిరంతరం మెరుగుపరుస్తూ వుండాలి.

జాతీయ ఆర్థిక వ్యవస్థకు ప్రణాళికా బద్ధంగా సారథ్యం వహించేందుకు సంబంధించిన ఆర్థిక సాధనాల ఫలదాయకత చాలా విషయాల్లో *ధరలను రూపొందించే పద్ధతిపై* ఆధారపడి వుంది. పారిశ్రామిక సరకుల టోకు ధరలను నేటి పరిస్థితులకు అనుగుణంగా చేసేందుకు చాలా కృషి చేశాం. దీని ఫలితంగా అవి ఈనాడు, సామాజికంగా అవసరమయిన శ్రమ శక్తి వినిమయాన్ని మరింత ఖచ్చితంగా ప్రతిబింబిస్తున్నవి. దీనివల్ల లాభ నష్టాల సూత్రాన్ని మరింతగా పటిష్టం చేసేందుకు తగిన పరిస్థితులు సృష్టి అయాయి. టోకు ధరల వ్యవస్థను మెరుగు పరచడాన్ని మనం కొనసాగించాలి. శ్రామిక ఉత్పాదక శక్తి పెరిగి, ఉత్పత్తి ఖర్చులు తగ్గేకొద్దీ పారిశ్రామిక సరకుల టోకు ధరలను తగ్గిం చుతాం.

ధరలను రూపొందించేందుకు సంబంధించిన సరైన విధానం, తమ ఉత్పత్తులను ఆధునికీకరించడంలో, వాటి నాణ్యతను పెంచడంలో, శాస్త్ర, సాంకేతిక ప్రగతిని వేగిర పరచడంలో ఫ్యాక్టరీల, సంయుక్త పరిశ్రమల బాధ్యతను తప్పక యినుమడింప జేస్తుంది. కొత్త యంత్రాల వాడుకవల్ల ఏర్పడే ఆర్థిక ప్రభావాన్ని దృష్టిలో పెట్టుకొని వాటి ధరలను నిర్ణయించాలి. ఉత్పత్తి దారుకూ, వినిమయ దారుకూ, ఉభయులకూ ప్రయోజనకరంగా ఉండేందుకు యిది అవసరం. ధరలన్నవి ఆర్థిక నియంత్రణలో సోషలిస్టు రాజ్యాంగ వ్యవస్థకు ఒక శక్తివంతమైన సాధనం. ఈ సాధనాన్ని మనం చాకచక్యం తోనూ, ఫలదాయంగానూ వినియోగించుకోవాలి.

సంస్కరణ అమలు జరుగుతున్న పరిస్థితుల్లో *పరపతి పాత్ర* పెరిగింది. చెలా

మణీలో ఉండే ఆస్తుల్లో దాదాపు సగభాగమూ, మౌలిక ఆస్తుల్లో పెద్ద భాగమూ ఈనాడు పరపతి సహాయంతోనే రూపొందుతున్నవి. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకు, అంతర్ సమిష్టి వ్యవసాయక్షేత్ర సంస్థలకు, వినిమయదారుల సహకార సంఘాలకు, ప్రజలకు ప్రభుత్వం రుణాల రూపంలో గణనీయమైన సహాయం అందజేస్తూ వుంది. సరకులకు, సేవా సదుపాయాలకు జరిపే చెల్లింపుల్లో 75 శాతానికి పైగా ఈ రుణా యన్నవి.

జాతీయ రుణ నిధి యొక్క, చెలామణీ నిధుల యొక్క వినియోగం గడచిన ఐదేళ్ళలో మెరుగైంది. పరిశ్రమల రంగంలో చెలామణీ నిధుల లావాదేవీ త్వరితం కావటం, రుణాలను తిరిగి చెల్లించే వ్యవధి తగ్గటం యిందుకు నిదర్శనం.

పరపతి సంబంధాల పాత్రను యినుమడింప చేస్తూనే వుండటం చాలా అవసరం. ఫ్యాక్టరీలకూ, సంస్థలకూ రుణాలిచ్చే సందర్భంలో అవి మరింత ఫలదాయకమైన నిర్మాణ ప్రాజెక్టులనూ, కొత్త సాంకేతిక సాధన సామగ్రులను సమకూర్చుకునే ప్రాజెక్టులనూ ఎంచుకొనేలా స్టేట్ బ్యాంకు, నిర్మాణ బ్యాంకు తమ పలుకుబడిని మరింతగా ఉపయోగించాలి. పెట్టిన పెట్టుబడిని వేగంగా రాబట్టుకోగల, జాతీయార్థిక వ్యవస్థ యొక్క ప్రథమ శ్రేణి అవసరాలను తీర్చగల ప్రాజెక్టులకు, పరపతిని సమకూర్చట మన్నదానికి ప్రభుత్వ ప్రణాళికలో సర్వోపరి ప్రాధాన్య మివ్వటం సహేతుకమైనదే.

*పాదార్థిక, సాంకేతిక సరఫరా* వ్యవస్థ గొప్ప కర్తవ్యాలను నెరవేర్చవలసి వుంది. ప్రాంతాలవారీ సూత్రాన్ని అనుసరించి, ఇటీవలి సంవత్సరాల్లో మనం ఆచరణలో, పాదార్థిక, సాంకేతిక సరఫరా సంస్థల ఒక కొత్త, దేశ వ్యాపిత వ్యవస్థను సృష్టించాం. పాదార్థిక, సాంకేతిక సరఫరా సంస్థల పనిలో యిప్పటికీ కొన్ని లోపాలున్నా, యిలాంటి వ్యవస్థ వుండటం చాలా అవసరమని అనుభవం నిరూపిస్తూ వుంది.

దేశ వ్యాపిత సరఫరా వ్యవస్థ ఫలితంగా, పరిపాలనా సంబంధమైన స్థానిక ఆంక్షలు అడ్డు తగలకుండా వుండే ఒక చెలామణీ రంగాన్ని వ్యవస్థీకరించేందుకూ, అదే సమయంలో శాఖలవారీగా పరిశ్రమను నిర్వహించడంవల్ల సమకూరే లాభాలను పొందేందుకూ మనకు వీలు కలుగుతుంది. పాదార్థిక, సాంకేతిక సరఫరాలను నిర్వహించే ప్రభుత్వ కమిటీ ద్వారా, ఇటీవల వివిధ ఫ్యాక్టరీలమధ్య శాశ్వతమైన బంధాలు వృద్ధి చెందుతున్నవి. ఒప్పందం ప్రకారం నిర్ణయించిన గడువు లోపల అవసరమైన సరకులన్నీ ఫ్యాక్టరీలకు సరఫరా అయ్యేలా ఈ కమిటీ హామీ కల్పిస్తూంది.

వనరులు పెరిగేకొద్దీ, ఉత్పత్తి సాధనాల టోకు వర్తకాన్ని మనం అభివృద్ధి పరచగలుగుతాం. హేతుబద్ధమైన ఆర్థిక బంధాలను ఎంచుకునే విషయంలో, ఫ్యాక్టరీల, సంయుక్త పరిశ్రమల స్వేచ్ఛనూ, చొరవనూ యిది యినుమడింప జేస్తుంది; పాదార్థిక వనరులను పొదుపు జేసేందుకూ, పనిని మెరుగు పరచేందుకూ, సరఫరా యంత్రాంగాన్ని తగ్గించేందుకూ సాయపడుతుంది.

జాతీయార్థిక వ్యవస్థయొక్క పరిపాలనా నిర్మాణాన్ని మరింత హేతుబద్ధం గావించట మనేది కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో మనం నెరవేర్చవలసిన అతి ముఖ్య కర్తవ్యాల్లో ఒకటి.

పరిపాలనా రంగానికి సంబంధించిన నూతన పథకాలను ఎంచుకోవటం వేరు వేరు శాఖల ప్రత్యేకతల పైనా, ఆచరణ పూర్వక అనుభవాన్నీ, శాస్త్రీయమైన గణాంక సమాచారాన్నీ కూలంకషంగా అధ్యయనం గావించటం పైనా ఆధారపడి జరగాలి. ప్రస్తుతం ఉన్న ప్రామాణిక పరిపాలనా సంబంధ నిర్మాణాలను మనం విమర్శనా దృష్టితో సమీక్షించాలి. వీటిలో కొన్నింటికి యిప్పటికే కాలం చెల్లిపోయింది.

వివిధ పారిశ్రామిక శాఖల పరిపాలనా నిర్మాణాన్ని మరింతగా మెరుగు పరచేందుకు, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ, సోవియట్ మంత్రిమండలీ చర్యలు తీసుకుంటున్నవి. అనేక పారిశ్రామిక శాఖలలో నేడున్న నిర్వహణ వ్యవస్థలను యిటీవలనే వివేచనచేసి మెరుగు పరచటం జరిగింది. ఉదాహరణకు బొగ్గు పరిశ్రమలో దీన్ని సరళం గావించారు: గనులకూ, కంబైన్లకూ మధ్య ఉన్న బొగ్గు పరిశ్రమ ట్రస్టులు అనవసరమని తేలినందువల్ల వాటిని రద్దు చేశారు. నూనె, రసాయన పరిశ్రమల్లో కూడా యిలాంటి చర్యలే తీసుకున్నారు.

రసాయనాలు, నూనె, బొగ్గు పరిశ్రమల పరిపాలనా పునర్ వ్యవస్థీకరణ వల్ల, సర్వసాధారణంగా రెండు, లేదా మూడు అంచెల వ్యవస్థ అత్యంత ఆమోద యోగ్యంగా ఉంటుందని తేలింది.

విడి విడి ఫ్యాక్టరీలకంటే, లాభనష్టాల సూత్రంపై ఆధారపడి పెద్ద ఎత్తున సరకును ఉత్పత్తి చేసే సంయుక్త పరిశ్రమలవల్ల గణనీయమైన లాభాలున్నవి. పారిశ్రామిక సంస్థలను మాత్రమే గాక పరిశోధన, అభివృద్ధి, రూపకల్పనా సంస్థలను కూడా భారీ సంయుక్త పరిశ్రమలుగా నిర్వహించవచ్చు. ఇందువల్ల విజ్ఞానశాస్త్ర కృషి ఉత్పత్తిరంగానికి మరింత సన్నిహిత మవుతుంది; శాస్త్ర, సాంకేతిక విజయాలను ఆర్థిక వ్యవస్థ సాధ్యమైనంత గరిష్ట వేగంతో వినియోగించు కోవటానికి వీలైన పరిస్థితులు ఏర్పడుతాయి.

ఒంటరిగా పని చేస్తున్న ఒక ఫ్యాక్టరీకి స్వతంత్రంగా అవసరాలను నిర్ధారణ చేయటం, సరఫరాను, అమ్మకాన్నీ వ్యవస్థీకరించటం, ప్రత్యేక అంశాలపై కేంద్రీ కరణనూ, సహకారాన్నీ మెరుగుపరచడం, అనుబంధ వృత్తులను కేంద్రీకృతం చేయటం మొదలయినవి కష్టం. ఈ విధులను సంయుక్త పరిశ్రమలు స్వీకరించాలి. ఈ సంయుక్త పరిశ్రమలను ఏర్పాటు చేసేందుకు ఉత్పత్తిని మరింతగా కేంద్రీకరించటమూ, పాదార్థిక, ద్రవ్య వనరులలో అవసరమైన భాగాన్ని కేంద్రీకరించటమూ అవసరం.

నిర్వహణ వ్యవస్థను మెరుగు పరచటంలో సంయుక్త పరిశ్రమల ఏర్పాటు ఒక కొత్త ముఖ్య అంశం. సంయుక్త పరిశ్రమల అభివృద్ధి మూలంగా, ఆర్థిక సంస్కరణవల్ల

లభించే అవకాశాలను మరింత పూర్తిగా ఉపయోగించేందుకూ, శాస్త్ర, సాంకేతిక ప్రగతిని వేగిర పరచేందుకూ వీలవుతుంది.

సంయుక్త పరిశ్రమలను ఏర్పరచే విషయంలో మన వైఖరి దూరదృష్టితో కూడి నదిగానూ, ఆర్థికంగా చక్కటి ఆధారాలు కలదిగానూ వుండాలి. వివిధ ఫ్యాక్టరీలను సంయుక్త పరిశ్రమలుగా కలిపివేయటం, మంత్రిత్వ శాఖకూ, ఫ్యాక్టరీకి మధ్య అదనంగా మధ్యంతర అంచెలు ఏర్పడటానికి, పరిపాలనా సిబ్బంది విస్తరణకు, ఆ సిబ్బంది నిర్వహణకు అయ్యే ఖర్చులు మరింత పెరిగిపోవటానికి దారి తీయరాదు.

ఈ విధమైన నిర్వహణ రూపాన్ని ప్రవేశపెట్టే పంథాను మంత్రిత్వ శాఖలు నిస్సంకోచంగా చేపట్టాలి. మహాసభ ఈ విషయాన్ని పేర్కొనటం సరయినదే.

అన్ని శాఖల్లోనూ సంయుక్త పరిశ్రమల వ్యవస్థా నిర్మాణమూ, రూపాలూ ఒకే విధంగా ఉండకపోవటం సహేతుకమే; సృజనాత్మక అన్వేషణ యిప్పటికీ అవసరంగా వున్నది విషయంలోనే.

అనుబంధ సంస్థలు గల భారీ ఫ్యాక్టరీలు, పరిశోధనా సంస్థ ఆధిపత్య విధులను నిర్వహించే శాస్త్ర, ఉత్పత్తి పరిశ్రమ సముదాయాలు—ఇవి సంయుక్త పరిశ్రమలకు ఫల దాయకమైన రూపం. తాము ఉత్పత్తి చేసిన సరకును విడుదల చేసే విషయంలోనూ, వాడకందారుల అవసరాలను ప్రత్యక్షంగా అధ్యయనం చేసే విషయంలోనూ సంయుక్త పరిశ్రమల బాధ్యతను పెంచేందుకు, అది సొంతంగానే చిల్లర దుకాణాలను ఏర్పాటు చేయటం ఒక ఉపయోగకరమైన పద్ధతి.

లెనిన్‌గ్రాద్ ఆప్టికో - మెకానికల్ సంయుక్త పరిశ్రమ, "స్వెత్లానా," "పొజిత్రాన్" సంయుక్త పరిశ్రమలు, మాస్కోలోని లిఖచెవ్ మోటారుకార్ల ఫ్యాక్టరీ, దుస్తులు తయారు చేసే "బోల్షెవిచ్కా" సంయుక్త పరిశ్రమా—వీటి అనుభవం మనకు చక్కటి ఉదాహరణగా వుంది.

సంయుక్త పరిశ్రమలు ఏర్పాటయిన తరువాత మంత్రిత్వ శాఖలు, ఆ పరిశ్రమల శాఖను అభివృద్ధి పరచేందుకు సంబంధించిన మౌలిక సమస్యలపై తమ దృష్టిని లగ్నం చేయవచ్చు. ఆ శాఖ ఉత్పత్తి చేసే సరకుల విషయమై సామాజికావసరాన్ని అధ్యయనం చేయటమన్నది ఈ సమస్యల్లో మొట్టమొదటిది. ఈ అవసరాన్ని తీర్చటం మంత్రిత్వ శాఖల కృషికి విలువ గట్టేందుకు ఉపయోగపడే అన్నిటికన్నా ముఖ్యమైన గీటురాళ్ళలో ఒకటి. ఆ మంత్రిత్వశాఖ ఈనాడీ కర్తవ్యాన్ని పూర్తిగా నెరవేర్చలేకుండా వున్నట్లయితే, అందు కోసం అది ఒక కార్యాచరణ పథకాన్ని తయారు చేసుకోవాలి; ఒక నిర్ణీత వ్యవధిలో దాన్ని పూర్తిచేసే మార్గాలను, నిర్ణయించుకోవాలి.

తమ శాఖలో అభివృద్ధికి గల దీర్ఘకాలిక అవకాశాలను బట్టి వ్యవహరిస్తూ, ఆయా మంత్రిత్వ శాఖలు ఒకే విధమైన సాంకేతిక విధానాన్ని రూపొందించి, కొనసాగించాలి;

ఉత్పత్తి, నిర్మాణాల ఫలదాయకతను పెంచాలి. మంత్రిత్వ శాఖల పనిలో, ముఖ్యంగా యింజినియరింగ్ మంత్రిత్వ శాఖల పనిలో వ్యవస్థీకరణ లోప భూయిష్టంగా వున్నందుకు ఉదాహరణంగా, యంత్రాల యొక్క యంత్ర పరికరాల యొక్క విడి భాగాల పరిస్థితిని మనం పేర్కొనవచ్చు. దీని ప్రభావం అన్నిటి కంటే ఎక్కువగా వ్యవసాయ రంగంలో అనుభవానికి వస్తూంది. విడిభాగాల సరఫరాలో అంతరాయాల వల్ల ఎంతో హాని జరుగుతూంది. పనులు నిలిచిపోవటమూ, చాలామంది పనివారు సగం చేతివృత్తుల పద్ధతిలో పని చేయవలసి రావటమూ జరుగుతూ వుంది; దీని వల్ల యంత్రాల మరమ్మతు ఖర్చులు బాగా పెరిగి పోతున్నవి.

తాము తయారు చేసిన యంత్రాలకు విడి భాగాలను సరఫరా చేయవలసిన బాధ్యతను ఆయా మంత్రిత్వ శాఖలు వదుల్చుకోవటం ఏమాత్రం సహించరాని విషయం. వినిమయదారు అడిగినదే తడవుగా ఫ్యాక్టరీలు విడి భాగాలను సరఫరా చేసేలా వుండాలి. ఇంజినియరింగ్ ఫ్యాక్టరీల, మంత్రిత్వ శాఖల పనికి విలువగట్ట వలసింది, అవి ఎన్ని యంత్రాలను తయారు చేశాయనే దాన్నిబట్టి మాత్రమే కాదు. ఆ యంత్రాలు ఎలా పని చేస్తున్నాయి, వాటికి విడిభాగాల సరఫరా ఎలా ఉందనే దాన్నిబట్టి గూడా ఆ సంస్థల పనికి విలువ కట్టాలి.

ఫ్యాక్టరీ గానీ, సంయుక్త పరిశ్రమ గానీ, మంత్రిత్వ శాఖ గానీ, ప్రభుత్వ ప్రణాళికా కమిటీ గానీ-ఏదైనాసరే, ఆర్థికవ్యవస్థ అన్ని స్థాయిల్లోనూ, తీసుకున్న నిర్ణయం ఏదైనా అత్యుత్తమమైందిగా వుండేలా చూడాలి.

ఏ ఆర్థిక సమస్య గురించి అయినా సరే నిర్ణయాలు తీసుకునేటప్పుడు, ఆయా శాఖలకు చెందిన నిపుణుల అంచనాలనే గాక, అనధికార నిపుణుల అంచనాలను కూడా ఆధారం చేసుకొని తలపెట్టిన నిర్ణయానికి ప్రత్యామ్నాయాలను పోల్చి చూడాలి. అభివృద్ధి సంస్థలు, మంత్రిత్వ శాఖలు, డిపార్టుమెంటులు, ప్రభుత్వ ప్రణాళికా కమిటీ, పాదార్థిక, సాంకేతిక సరఫరాల ప్రభుత్వ కమిటీ, ఏ నిర్ణయాలను ప్రతిపాదించినా, ఏ నిర్ణయాలు చేసినా అవి సంపూర్ణమైన ఆధారాలు కలవిగా ఉండేలా చూడాలని మనం గట్టిగా కోరాలి.

ఒక శాఖయొక్క ఆర్థిక, సాంకేతిక విధాన ఐక్యతను నిర్ణయించేటటువంటి నిర్వహణ విషయిక శాఖా సూత్రాన్ని, రిపబ్లిక్కుల్లో, ఆర్థిక ప్రాంతాల్లో, మండలాల్లో హేతుబద్ధమైన ఆర్థిక బంధాల వ్యవస్థతో మనం మరింత ఫలదాయకంగా జోడించాలి. అంతర్ శాఖ, మండల ఆర్థిక సమస్యల విపులీకరణను మెరుగు పరచటం యిందుకు అవసరం. అంతర్ శాఖ బంధాలను అభివృద్ధిపరచే విషయంలో, ముఖ్యంగా, సహకార చట్రంలో సరఫరాలను పూర్తి చేసే విషయంలో, మంత్రిత్వ శాఖల బాధ్యతను పెంచాలి. హేతుబద్ధమైన ఉత్పత్తి బంధాలను విచ్ఛిన్నం చేసే సంకుచిత డిపార్టుమెంటు తత్వమూ, ఆర్థిక

కార్యకలాపాల్లో ఐక్యతను దెబ్బతీసే ప్రాంతీయ తత్వమూ—వీటికీ ఆర్థిక వ్యవస్థను నిర్వహించే సోషలిస్టు పద్ధతికీ సూత్రరీత్యానే చుక్కెదురు.

ప్రస్తుత పరిస్థితుల్లో ప్రణాళికా వ్యవస్థనూ, ఆర్థిక మేనేజిమెంటునూ మెరుగు పరచేందుకు, ఆర్థిక - గణిత శాస్త్ర పద్ధతులను విస్తృతంగా వర్తింప జేయటమూ, ఎలక్ట్రానిక్ కంప్యూటర్లను, మేనేజిమెంటు విధుల నిర్వహణకు తోడ్పడే యంత్రాలను, పురోగామి వార్తా ప్రసార సాధనాలను ఉపయోగించటమూ అవసరం. ఎలక్ట్రానిక్ కంప్యూటర్లను వినియోగించి నందువల్ల, సమాచారాన్ని అందుకోవటమూ, దాన్ని విచేచన చేయటమూ, ఒక పథకానికి సంబంధించిన అనేక ప్రత్యామ్నాయాలను విపులీకరించటమూ, ప్రణాళికా సమస్యలకు అత్యుత్తమమైన పరిష్కారాలను కనుగొనటమూ త్వరగా జరుగుతుంది. ఆర్థిక,సామాజిక క్రమాలను దేశ వ్యాపిత స్థాయిలో నడిపించేందుకు వీలు కల్పించే సోషలిస్టు ఆర్థిక వ్యవస్థలోని లాభాల కారణంగా, ఎలక్ట్రానిక్ కంప్యూటర్ల విస్తృత వినియోగం, మన ప్రణాళికలు మరింత చక్కటి ఆధారాలు కలవిగా ఉండేలా చేస్తుంది; అత్యుత్తమ పరిష్కారాలను కనుగొనేందుకు సాయపడుతుంది.

అనేక మంత్రిత్వ శాఖలూ, ఫ్యాక్టరీలూ స్వయంచలిత నియంత్రణా వ్యవస్థలను విజయవంతంగా ఉపయోగించుతున్నవి. ప్రభుత్వ ప్రణాళికా కమిటీ, పాదార్థిక, సాంకేతిక సరఫరాల ప్రభుత్వ కమిటీ, కేంద్ర గణాంక సంస్థ అనేక యితర ప్రభుత్వ శాఖలూ, కంప్యూటర్ కేంద్రాలను నెలకొల్పాయి. ఈ ఐదేళ్ళలో పారిశ్రామిక, వ్యాపసాయిక, వార్తా ప్రసార, వర్తక, రవాణా రంగాలకు చెందిన ఫ్యాక్టరీల్లోనూ, సంస్థల్లోనూ, కనీసం 1600 స్వయంచలిత నియంత్రణా వ్యవస్థలను పనిలో పెట్టాలని తలపెడుతున్నారు.

కంప్యూటర్ కేంద్రాల దేశవ్యాపిత వ్యవస్థనూ, శాఖోపశాఖలుగా ఉన్న, ఒకే ఒక దేశ వ్యాపిత స్వయంచలిత సమాచార వ్యవస్థనూ ఆధారం చేసుకొని, సమాచారాన్ని సేకరించేందుకూ, విచేచించేందుకూ, లెక్కలు కట్టేందుకూ, ప్రణాళికా రచనకూ, ఆర్థిక మార్గదర్శనకూ దేశ వ్యాపితమైన ఒకే ఒక స్వయంచలిత వ్యవస్థ నేర్పరచేందుకు మన ప్రణాళికాబద్ధ ఆర్థికవ్యవస్థ వీలు కలిగిస్తూ వుంది.

మేనేజిమెంటు విధులను నిర్వహించే కార్యకర్తల సమస్యపై నిరంతర శ్రద్ధ అవసరం. ఉన్నత కార్యనిర్వహణాధికారులతో సహా అన్ని స్థాయిల్లోనూ మేనేజిమెంటు విధులను నిర్వహించే సిబ్బందికి శిక్షణ, పునఃశిక్షణ యిచ్చే వ్యవస్థను ఏకరీతిగా, విస్తరింప జేయాల్సిన, మెరుగు పరచ వలసిన కర్తవ్యం మన ముందు వుంది.

మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతం గురించిన కూలంకష పరిజ్ఞానం, మేనేజిమెంటుకు సంబంధించిన సిద్ధాంతమూ, ఆచరణ, శాస్త్రీయమైన శ్రమ వ్యవస్థీకరణ, ప్రణాళికా రచన, ఆర్థిక ప్రోత్సాహకాలకు సంబంధించిన కొత్త పద్ధతులు, ఆర్థిక-గణిత శాస్త్ర పద్ధతులు,

ఆధునిక కంప్యూటర్ శాస్త్రం — వీటిపై ఆధారపడిన కొత్త మేనేజిమెంటు పద్ధతులను, అభ్యసించటం ఆర్థిక రంగ నిర్వహణాధికారుల కర్తవ్యం.

*సోషలిస్టు ప్రజాస్వామ్యం మరింతగా అభివృద్ధి చెందడమూ,* ఉత్పత్తి నిర్వహణలో శ్రామిక ప్రజలు విస్తృతంగా పాల్గొనటమూ, ఆర్థికవ్యవస్థ నిర్మాణంయొక్క మేనేజిమెంటు యొక్క ఫలదాయకతను పెంచేందుకు ఒక ముఖ్యమైన షరతు. సమాజం యొక్క, సమిష్టి సంస్థయొక్క ప్రయోజనాలను ప్రతి ఒక్క శ్రామికవ్యక్తి ప్రయోజనాల తోనూ జోడించటం అన్న, మన ఆర్థిక కార్యకలాపాలకు సంబంధించిన అతి ముఖ్య సూత్రం అమలు జరిగేలా యిది హామీ కల్పిస్తుంది.

పార్టీ మహాసభ, ముసాయిదా ఆదేశాలను ఆమోదించిందంటే,అవి సోవియట్ ప్రజలు యావన్మందికీ మార్గదర్శకం అవుతాయి. వార్షిక కర్తవ్యాలను నిర్దేశించి పంచవర్ష ప్రణాళికా రచనను మనం సాధ్యమైనంత త్వరగా పూర్తి చేయాలి. దీన్ని ప్రభుత్వమూ, ఒక విస్తృత సమావేశంలో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ పరిశీలించిన మీదట, సోవియట్ యూనియన్ సుప్రీమ్ సోవియట్ ఆమోదానికి పెట్టటం జరుగుతుంది. ప్రతి ఒక్క సంయుక్త పరిశ్రమకూ, ఫ్యాక్టరీకి అందించేందుకు వీలుగా, ప్రణాళికను రూపొందించే పనిని 1971 ఆగస్టు ఒకటవ తేదీ నాటికి ముందే పూర్తి చేయాలి.

ఒక్కొక్క సంవత్సరానికి విడగొట్టి పంచవర్ష ప్రణాళికను తయారు చేసినంత మాత్రాన, జీవితానుభవాన్ని బట్టి దానిలో సవరింపు లేమీ అవసరం కావని అర్థంకాదు. ఇది సహేతుకమే.

ప్రభుత్వ ప్రణాళికా కమిటీ, యూనియన్ రిపబ్లిక్కుల మంత్రి మండలులూ, వివిధ మంత్రిత్వ శాఖలూ, ప్రణాళికలో సరైన నిష్పత్తులు ఉండేలా చేయటం ప్రధానంగా అవసరం. వారు పంచవర్ష ప్రణాళికను సమతూకంగా రూపొందించాలి. సామాజిక అవసరాలను మరింత ఖచ్చితంగా నిర్ధారణ చేసేందుకూ, శాస్త్ర, సాంకేతిక రంగ ఫలితాలను మరింత సంపూర్ణంగా లెక్కలోకి తీసుకునేందుకూ, ఉత్పత్తి వ్యవస్థా నిర్మాణాన్ని మరింత సరిగ్గా నిర్వచించేందుకూ యిందువల్ల సాధ్యమవుతుంది.

మేనేజిమెంటునూ, ప్రణాళికా రచననూ మెరుగు పరచే విషయంలో పార్టీ మహాసభ నిర్దేశించిన కర్తవ్యాలను పూర్తి చేయటంలో పార్టీ, ట్రేడ్ యూనియన్ సంస్థలూ, ప్రభుత్వమూ, ఆర్థికశాఖల నిర్వహణాధికారులు సృజనాత్మకమైన చొరవనూ, పూనికనూ చూపగలరని ఆశించేందుకు నన్ను అనుమతించండి.

## V

# సోవియట్ ప్రజల జీవన ప్రమాణము, సాంస్కృతిక స్థాయీ ఇతోధిక పెరుగుదల

కామ్రేడ్స్, ప్రజల జీవన స్థాయిని పెంచేందుకు సంబంధించిన పార్టీ విధానాన్ని కామ్రేడ్ బ్రెజ్నెవ్, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ నివేదికలో తెలియజేశారు.

సోవియట్ ప్రజల జీవన స్థాయిని పెంచేందుకూ, వారి పని పరిస్థితులను, జీవన పరిస్థితులను మెరుగు పరచేందుకూ ఒక విస్తృత కార్యక్రమాన్ని ముసాయిదా ఆదేశాలు రూపొందించాయి.

కొత్త పంచవర్ష ప్రణాళిక కాలంలో మన ప్రజల జీవన ప్రమాణం, ప్రధానంగా శ్రామిక ప్రజల శ్రమ ఉత్పాదకతా, వారి అర్హతలూ పెరగవడంతో కార్మికులకూ, ఆఫీసు పనివారికీ అధిక వేతనాలూ, జీతాలూ, సమిష్టి వ్యవసాయ క్షేత్ర రైతాంగానికి అధిక ఆదాయాలూ లభించడం ఫలితంగా మరింత పెరుగుతుంది. ప్రజల ఆదాయాల పెరుగుదలలో అధిక భాగం ఈ విధంగా లభించేదే.

ప్రజల జీవనప్రమాణాన్ని పెంచేందుకు సంబంధించిన కార్యక్రమం పెద్ద ఎత్తున అనేక చర్యలను తలపెడుతూ వుంది.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ, సోవియట్ యూనియన్ మంత్రిమండలీ మన వనరులను అంచనా కట్టిన మీదట, ఈ కార్యక్రమాన్ని అమలుపరచే వరుసక్రమాన్నీ, గడువునూ నిర్ణయించాయి. అఖిల యూనియన్ ట్రేడ్ యూనియన్ల కేంద్ర కౌన్సిల్ కూడా యిందులో పాల్గొంది.

ఈ కార్యక్రమాన్ని అనుసరించి, 1971 లో నెలసరి కనీస వేతనాల్ని 70 రూబుళ్ళకు పెంచవలసి వుంది. రైల్వే కార్మికుల్లోని, ఉద్యోగుల్లోని మధ్యంతర తరగతుల మూలవేతనాలనూ, జీతాలను కూడా పెంచనున్నారు. అదే సంవత్సరంలో వ్యవసాయక్షేత్రాల్లో పనిచేసే యంత్ర నిర్వాహకుల వేతనాల రేట్లు కూడా పెరుగనున్నవి.

1971 జూలై ఒకటినుంచి, సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతులకిచ్చే కనీస పింఛన్‌ను పెంచాలనీ, కార్మికుల, ఆఫీసు ఉద్యోగుల పింఛన్లను నిర్ణయించేందుకు సంబంధించిన నిబంధనలను వీరికి గూడా వర్తింప జేయాలనీ, ప్రణాళికలో తలపెడుతున్నారు.

అదే రోజునుండి, అంటే 1971 జూలై ఒకటినుంచి కార్మికుల, ఆఫీసు ఉద్యోగుల కనీస వార్ధక్య పింఛన్‌ను కూడా పెంచుతారు. 1972లో ఒక కొత్త కనీస వేతనాన్ని ప్రవేశ పెట్టనున్నారు. అదే సమయంలో, దూర ఉత్తరాది, అదే ప్రతిపత్తిగల ప్రాంతాలయిన దేశ యూరపియన్ ప్రాంతపు ఉత్తరభాగంలోనూ, తూర్పు, పశ్చిమ సైబీరియాల

లోనూ, ఉరల్స్‌లోనూ, మధ్యమ శ్రేణుల్లోని కార్మికుల, ఆఫీసు ఉద్యోగుల కనీస వేతనాలనూ, జీతాలనూ పెంచటం జరుగుతుంది.

1972 సెప్టెంబర్ మొదటి తేదీనుంచి దేశమంతటా, ఉపాధ్యాయుల, వైద్యుల జీతాలను ఏకకాలంలో, సగటున దాదాపు 20 శాతం చొప్పున, పాఠశాలలకు వెళ్లే వయస్సు లోపు శిశువుల సంస్థలలో పనిచేసే ఉపాధ్యాయుల జీతాలను అంతకంటే మరింత ఎక్కువగానూ పెంచాలని ప్రణాళికలో తలపెడుతున్నారు. ఆనాటినుంచే ఉన్నత విద్యాసంస్థల్లో విద్యార్థుల కిచ్చే ఉపకార వేతనాలను 25 శాతమూ, సాంకేతిక పాఠశాలల విద్యార్థులకిచ్చే ఈ మొత్తాలను సగటున 50 శాతమూ పెంచనున్నారు.

కజకస్తాన్, మధ్య ఆసియా, వోల్గా, వోల్గా-వ్యాత్కా ప్రాంతాల్లోని, దోనెట్జ్ బేసిన్‌లోని ఉత్పత్తి విభాగాల్లో, 1973 లో మధ్యమశ్రేణి కార్మికులకూ, ఉద్యోగులకూ, ఒక కొత్త కనీస వేతనాన్నీ, మరింత ఎక్కువ మూల వేతనాలనూ ప్రవేశపెట్టడం జరుగుతుంది.

కుటుంబ పోషకుణ్ణి కోల్పోయిన సైనికుల కుటుంబాలకు యిచ్చే పింఛన్లను కూడా పెంచడం జరుగుతుంది.

జబ్బుపడిన బిడ్డలకు సేవచేసే నిమిత్తం జీతంతో యిచ్చే సెలవు కాలాన్ని పెంచ తలపెట్టారు. ఈ కాలానికి యిచ్చే అలవెన్సు తాత్కాలిక అశక్తత ఏర్పడినప్పుడిచ్చే దానికి సమానంగా వుంటుంది.

మిగతా దేశమంతటిలోనూ, ఉత్పత్తి శాఖల్లోని, విద్యా, పౌర ఆరోగ్య సదుపాయాల రంగంలోని, మధ్యమశ్రేణి కార్మికులకూ, ఆఫీసు ఉద్యోగులకూ కొత్త కనీస వేతనం ప్రవేశపెట్టే పనినీ, మూల వేతనాలనూ, జీతాలనూ పెంచే పనినీ, 1974 సంవత్సరంలో పూర్తి చేయవలసి వుంది.

పనిలోనూ, యుద్ధంలోనూ గాయపడి అశక్తులైన వారికిచ్చే పింఛన్లను పెంచటమన్నది 9వ పంచవర్ష ప్రణాళికా కాలంలో పింఛన్లకు సంబంధించిన పెద్ద చర్యల్లో ఒకటి. ఈ అశక్తులకు యిచ్చే పింఛన్లను సగటున 33 శాతం పెంచుతారు. పోషకుణ్ణి కోల్పోయిన కుటుంబాల కిచ్చే పింఛన్లను అదే సమయంలో సరాసరి 20 శాతం పెంచటం జరుగుతుంది.

కొత్త కనీస వేతనాలను ప్రవేశపెట్టేందుకూ, మధ్యమశ్రేణి కార్మికుల, ఉద్యోగుల వేతనాలనూ, జీతాలనూ పెంచేందుకూ సంబంధించిన క్రమం 1975లో పూర్తి అవుతుంది.

వేతనాలకు సంబంధించిన వ్యత్యాసాలను ప్రవేశ పెట్టటం ద్వారా, లేదా వాటిని పెంచటం ద్వారా కొన్ని ప్రాంతాల్లో 9వ పంచవర్ష ప్రణాళికా కాలంలో వేతనాలను క్రమేణా పెంచాలని కూడా తలపెట్టారు. పశ్చిమ సైబీరియా, ఉరల్స్, దక్షిణాది ప్రాంతాలు మినహా మిగతా కజక్‌స్తాన్‌లోనూ, మధ్య ఆసియాలోని కొన్ని ప్రాంతాల్లోనూ, యిదివరకు ఈ

వ్యత్యాసాలు వర్తించకుండా వున్న కార్మికుల, ఉద్యోగుల వేతనాలకూ, జీతాలకూ ఈ వ్యత్యాసాలను నిర్ణయిస్తారు. దూరప్రాచ్యం, తూర్పు సైబీరియాల్లోని చాలా ప్రాంతాల ఆర్థిక విభాగాల్లోని జీతాల, వేతనాల విషయంలో అమల్లో వున్న ప్రాంతీయ వ్యత్యాసాలను పెంచటం జరుగుతుంది.

కార్మికులకూ, ఆఫీసు ఉద్యోగులకూ రాత్రి వేళల్లో పనిచేసినందుకు అదనంగా జరిపే చెల్లింపులు గణనీయంగా పెరుగనున్నవి.

కొత్త కనీస వేతనాన్ని ప్రవేశపెట్టటం, కార్మికుల్లోని, ఉద్యోగుల్లోని మధ్యమ శ్రేణులవారి వేతనాలనూ, మూల జీతాలనూ పెంచటం, మండలాల వారీగా జీతాలనూ, వేతనాలనూ క్రమబద్ధం చేసే పద్ధతిని మెరుగు పరచడం—ఇవన్నీ గొప్ప సామాజిక-ఆర్థిక ప్రాముఖ్యం గల చర్యలు. అవి వేతనాల రేట్ల విధానానికి పుష్టి చేకూర్చగలవు; రేట్ల నిర్ణయాన్ని మెరుగు పరచేందుకు సాయపడగలవు; నిపుణులైన, నిపుణులు కాని కార్మికుల వేతనాల మధ్య వేరువేరు శాఖల్లోని, మండలాల్లోని వేతనాల మధ్య మరింత సరైన సంబంధాన్ని ఏర్పరచగలవు.

కనీస వేతనాలను హెచ్చించే చర్యకు అనుగుణంగానే, నెలకు 70 రూబుళ్ళ వరకు వేతనాలు తెచ్చుకునే కార్మికుల, ఆఫీసు ఉద్యోగుల ఆదాయపు పన్నును రద్దు చేయటమూ, నెలకు 90 రూబుళ్ళ వరకూ వేతనాలు సంపాదించుకునే వారిపై పన్నులను తగ్గించటమూ జరుగుతుంది.

స్వల్ప ఆదాయాలుగల కుటుంబాల్లోని పసిబిడ్డలకు అలవెన్సులు చెల్లించే పద్ధతి ప్రవేశపెట్టాలని 9వ పంచవర్ష ప్రణాళిక తలపెడుతూ వుంది. ఎక్కువమంది బిడ్డలు గల కుటుంబాలకు సోవియట్ ప్రభుత్వం యిదివరకే సహాయం అందజేస్తూ వుంది. ఈ రకం కుటుంబాల్లోని బిడ్డలకు తక్కువ చార్జీలపై, శిశు సంస్థల్లో ప్రవేశం కల్పించటమూ, కుటుంబ పోషకునిపై ఆధారపడిన సభ్యుల సంఖ్యను బట్టి ఆదాయపు పన్ను తగ్గింపులను వర్తింపజేయటమూ జరుగుతూ వుంది. అన్ని రకాల ఆదాయాలనూ కలుపుకొని నెలకు తలసరి రాబడి 50 రూబుళ్ళకు పైబడని కుటుంబాలకు పసిబిడ్డల నిమిత్తం అలవెన్సులను, 9వ పంచవర్ష ప్రణాళికా కాలంలో ప్రవేశపెట్ట సంకల్పిస్తున్నారు. వీటిని 1974లో ప్రవేశపెడతారు.

ఆసుపత్రుల్లోనూ, పట్టణాల్లోని, వృత్తి, సాంకేతిక పాఠశాలల్లోనూ యిచ్చే భోజనం అలవెన్సులను పెంచాలని ప్రణాళిక తలపెడుతూంది.

పైన పేర్కొన్న చర్యలన్నిటి కిందా ఈ పంచవర్ష ప్రణాళికా కాలంలో, ఆ క్రితం 5 సంవత్సరాల్లో కంటే 120 శాతం ఎక్కువ ఖర్చు చేయ తలపెట్టారు.

వచ్చే ఐదేళ్ళలో కార్మికుల, ఆఫీసు ఉద్యోగుల సగటు, నెలసరి నగదు వేతనాలు 20-22 శాతం, ఉమ్మడి యాజమాన్య రంగంలో పనిజేసినందుకు సమిష్టి వ్యవసాయక్షేత్ర

రైతులకు లభించే ప్రతిఫలం 30-35 శాతమూ పెరుగనున్నవి. సామాజిక నిధులలోనుంచి జరిపే చెల్లింపుల, కల్పించే సదుపాయాల మొత్తం 1975లో 90 వేల మిలియన్ రూబుళ్ళు అవుతుంది. అంటే, ఈ మొత్తం దాదాపు 40 శాతం పెరుగుతుంది.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి కామ్రేడ్ బ్రెజ్నేవ్ యింతకుముందే ఈ మహాసభకు నివేదించినట్లు, *ప్రభుత్వ దేశీయ రుణాల్ని నిర్ణీత గడువుకు ముందుగానే తీర్చివేయ తలపెట్టారు.*

1947-1956 మధ్య ప్రభుత్వం 11 దఫాలుగా రుణ పత్రాలు జారీ చేసింది. వీటి కింద ప్రభుత్వం దేశంలో చేసిన రుణం 25.8 వేల మిలియన్ రూబుళ్ళు.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ, సోవియట్ మంత్రి మండలి 1957 ఏప్రిల్ 19న తీసుకున్న నిర్ణయాన్ని అనుసరించి, 1977తో ప్రారంభించి, 20 సంవత్సరాల గడువులో ఈ రుణాలను తిరిగి చెల్లించవలసి వుండేది.

కేంద్ర కమిటీ, సోవియట్ మంత్రి మండలి, ఈ సమస్యను కూలంకషంగా పరిశీలించిన మీదట, వనరులన్నిటినీ బేరీజు వేసిన మీదట, నిర్ణీత గడువుకు ముందుగానే, అంటే 1974 నుంచే ఈ రుణాలను తీర్చడం ఆరంభించాలని అభిప్రాయపడుతున్నవి.

ఈ రుణాలను గడువు ప్రకారం ఈ క్రింది విధంగా తీర్చివేయాలని తలపెట్టారు: 1974, 1975లో సంవత్సరానికి ఒక వేయి మిలియన్ రూబుళ్ళు; 1976-1980 మధ్యన సంవత్సరానికి 1.2 వేల మిలియన్ రూబుళ్ళు; 1981-1985 మధ్య సంవత్సరానికి 1.5 వేల మిలియన్ రూబుళ్ళు; 1986-1989 మధ్య సంవత్సరానికి 2 వేల మిలియన్ రూబుళ్లు; 1990లో 2.3 వేల మిలియన్ రూబుళ్లు.

ఈ విధంగా ప్రభుత్వ రుణాన్ని తీర్చివేసే గడువును *6 సంవత్సరాలు* తగ్గించనున్నారు.

వాడకం సరకుల ఉత్పత్తినీ, వర్తక పరిమాణాన్నీ పెంచటం ద్వారా, ప్రజల నగదు ఆదాయాల అధిక పెరుగుదల ఫలితాన్ని తట్టుకోవాలి. ప్రజల నగదు ఆదాయాలు 40 శాతం పెరిగినందువల్ల, సరకుల అమ్మకం 42 శాతమూ, డబ్బు చెల్లించే పద్ధతిపై సమకూర్చే సేవా సౌకర్యాల పరిమాణం 47 శాతమూ పెరుగుతాయన్నది ముసాయిదా ఆదేశాల్లో పొందుపరచిన ఒక అంశం.

వచ్చే ఐదేళ్ళ కాలంలో మార్కెట్‌కు మాంసం, చేపలు, వనస్పతి, గుడ్లు, కూరగాయలు లాంటి ఉత్పత్తుల సరఫరా 40-60 శాతం పెరుగుతుంది. దుస్తుల అమ్మకం 35 శాతం, అల్లిక దుస్తుల అమ్మకం 56 శాతం, సాంస్కృతిక అవసరాలకు సంబంధించిన వస్తువుల, యిండ్లలో వాడుకునే వస్తువుల అమ్మకం 80 శాతం పెరుగుతుంది. 1970 నాటికి దేశంలో ప్రతి నూరు కుటుంబాలకు 32 రెఫ్రెజిరేటర్లు, 51 టెలివిజన్ సెట్లు, 52 బట్టలుతికే యంత్రాలూ వున్నవి. 1975 నాటికి ప్రతి నూరు కుటుంబాలకూ 64 రెఫ్రిజి

రేటర్లు, 72 టెలివిజన్ సెట్లూ, 72 బట్టలుతికే యంత్రాలూ వుంటాయి. ఈ ఐదేళ్ళు ముగిసే నాటికి ప్రజలకు మోటారుకార్ల అమ్మకం 1970 నాటి స్థాయికంటే 6 రెట్లు అధికం అవుతుంది.

మొత్తంపై వాడకం సరకుల ఉత్పత్తీ, అమ్మకమూ పెరగడంతోబాటు వాటి వైవిధ్యాన్ని నిరంతరం పెంచటమూ, మరింతగా మెరుగు పరచటమూ అవసరం. వాడకం దారుల అవసరాలను తీర్చేందుకు సరుకులను పెద్ద పరిమాణంలో సరఫరాచేయటం మాత్రమే కాదు మనం చేయవలసింది; దుకాణాల్లో వినిమయదారులకు ఎలాంటి సరుకులు లభిస్తున్నాయి, వాటి వైవిధ్యమూ, నాణ్యతా వారికి సంతృప్తి కలిగిస్తున్నాయా అన్నది ప్రధాన విషయం. ఇది పారిశ్రామిక, వర్తక రంగాలపై మరింత పెద్ద బాధ్యతలను మోపుతూ వుంది. వినిమయదారుల అవసరాల్లో వచ్చే మార్పులన్నింటికీ ఈ రంగాలు వేగంగా ప్రతిస్పందించాలి.

సరకుల కోసం పరిశ్రమలకు తామిచ్చే ఆర్డర్ల గురించి సరిగా అంచనా వేసే విషయంలోనూ, వినిమయదారులకు సరకులను సకాలంలో అందించే విషయంలోనూ వర్తక సంస్థల బాధ్యతను పెంచవలసిన తరుణం ఆసన్నమైంది. పరిశ్రమలు గూడా, తమ వంతు కర్తవ్యంగా, కొత్త రకాల సరకులను, మరింత నాణ్యమైన సరకులను తయారు చేయటం ద్వారా వినిమయదారుల కోర్కెలను ప్రాభావితం చేయాలి.

ఈ ఐదేళ్ళలో పౌరభోజన శాలల వర్తక పరిమాణం 50 శాతం పెరుగుతుంది. అల్పాహార శాలలు, క్యాంటీన్లు, కెఫేలు వీటిని శాఖోప శాఖలుగా విస్తరింపజేయడాన్ని కొనసాగించాలి. ముఖ్యంగా నిర్మాణ స్థలాల్లో, ఫ్యాక్టరీలలో, విద్యాసంస్థల్లో యిది జరగాలి. భోజన శాలల అభివృద్ధిలో, నాణ్యతనూ, సేవా సౌకర్యాలనూ పెంచడం ప్రధానం.

ముసాయిదా ఆదేశాల్లో పేర్కొన్నట్లు, కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో ప్రభుత్వ చిల్లర ధరల స్థిరత్వాన్ని ఖచ్చితంగా నిలబెట్టటం జరుగుతుంది. సరుకు నిలవలు పెరిగేకొద్దీ, కొన్ని రకాల సరుకుల ధరలను తగ్గించటం జరుగుతుంది.

వండుకోవడానికి సిద్ధం చేసిన, వడ్డించడానికి సిద్ధం చేసిన, నిర్జలీకృత ఆహార పదార్థాల ఉత్పత్తినీ, యిండ్లవద్ద వంట పనులను మరింత సులభం చేయగల యితర పదార్థాల ఉత్పత్తినీ, అమ్మకాన్నీ రానున్న కొద్ది సంవత్సరాల్లో పెద్ద ఎత్తున విస్తరింపజేయాలి.

బంగీ కట్టిన సరకుల ఉత్పత్తిని, సరకుల సరఫరాకై ముందుగానే ఆర్డర్లు పుచ్చుకునే ఆచారాన్ని, సరకులను పోస్టు ద్వారా వాడకం దారులకు అందించే పద్ధతిని, సరకు పంపిణీకి సంబంధించిన యితర పురోగామి పద్ధతులనూ చెప్పుకోదగ్గంతగా పెంచాలి.

నిత్యసేవా సౌకర్యాలను కనీసం రెట్టింపు పెంచవలసి వుంది. ఇందు కోసం

కుట్టు పని, బూట్ల తయారీ సంస్థలు, మరమ్మతు కర్మాగారాలు, డ్రై క్లీనింగ్ దుకాణాలు, లాండ్రీలు మొదలైన సేవా సౌకర్యాలను శాఖోపశాఖలుగా విస్తరింపజేయాల్సి వుంటుంది. నేటి పరిస్థితుల్లో సేవాసౌకర్యాలు భారీ, యాంత్రికీకృత పరిశ్రమగా అభివృద్ధి చెందటం అవసరం.

ఆదాయాలు పెరగటంతో, ప్రజల్లోని విస్తార తరగతుల సాంస్కృతికావసరాలు కూడా పెరుగుతున్నవి; కొత్త కొత్త అవసరాలు ఉత్పన్నమవుతున్నవి. ఉదాహరణకు యాత్రా పరిశ్రమ అధికాధికంగా ప్రజాభిమానాన్ని చూరగొంటున్నది. ఈ పరిశ్రమను మనం విస్తరింపజేయాలి, దానికి సంబంధించిన వసతులను మెరుగు పరచాలి; ఇంకా ఎక్కువగా హోటళ్ళనూ, శిబిరాలనూ, యాత్రలకు సంబంధించిన యితర సేవా సౌకర్యాలనూ సమకూర్చాలి.

1971-1975లో 565-575 మిలియన్ చదరపు మీటర్ల విస్తీర్ణం గల కొత్త నివాస గృహాలను నిర్మించాలని ముసాయిదా ఆదేశాల్లో తలపెట్టడం జరిగింది. మరింత చక్కని స్వరూపమూ, సదుపాయాలూ, వాటాల్లో మెరుగులూ కల, డిజైన్లను నానాటికీ మరింతగా ఆధారం చేసుకొని *గృహ నిర్మాణం* జరుగుతుంది.

గృహ నిర్మాణ సహకార సంఘాలను అభివృద్ధి పరచాలి; పట్టణాల్లోనూ, గ్రామ సీమలోనూ వ్యక్తులు స్వంతంగా యిండ్లు కట్టుకొనేందుకు కూడా సహాయం అందించాలి.

సదుపాయాలను పెంచేందుకూ, పట్టణాల అభివృద్ధికీ గణనీయమైన శ్రద్ధ వహించాలి. అధిక సంఖ్యాక పట్టణాలకూ, పట్టణాల్లాంటి జనావాసాలకూ కేంద్రీకృత నీటి సరఫరా ఏర్పర్చటం జరుగుతుంది. ఇండ్లలో విద్యుచ్ఛక్తి వాడకం పెరుగుతుంది. ఈ ఐదేళ్ళలో అదనంగా 17-18 మిలియన్ల యిండ్లకు గ్యాసు అందించాలని ప్రణాళికలో తలపెడుతున్నారు. పట్టణాల్లోని నివాస గృహాలకు 65-75 శాతం వరకూ, గ్రామ సీమలోని వాటికి 40-50 శాతం వరకూ గ్యాసు లభించుతుంది.

తొలి పంచవర్ష ప్రణాళికల రోజుల్లో మనం సార్వజనిక ప్రాథమిక విద్యను ప్రవేశ పెట్టాం. కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో *సార్వజనిక సెకండరీ విద్యను ప్రవేశ పెట్టడాన్ని పూర్తి చేయాలి*. ఇది కార్యరూపం ధరించడానికి గొప్ప రాజకీయ, సామాజిక ప్రాముఖ్యం వుంది. తన వృత్తిని ఎంచుకొనేందుకూ, తన శక్తిసామర్థ్యాలను యావత్తు సమాజాని కోసమూ అత్యంత ప్రయోజనకరంగా వినియోగించేందుకూ, సార్వజనిక విద్య ప్రతి ఒక్క పౌరునికీ విస్తారావకాశాలు సమకూర్చుతుంది.

ముసాయిదా ఆదేశాలు వృత్తి, సాంకేతిక విద్యల గురించి గణనీయమైన శ్రద్ధ వహించుతున్నవి. ఉన్నత విద్యనూ, ప్రత్యేక సెకండరీ విద్యనూ మరింతగా అభివృద్ధి పరచడం జరుగుతుంది. నూతన శాస్త్ర, సాంకేతిక రంగాలకు చెందిన వారిని కూడా

కలుపుకొని దాదాపు 9 మిలియన్ల మంది ప్రవీణులను తరిఫీదు చేయాలని ప్రణాళికలో తల పెడుతున్నారు.

ఈ సంవత్సరాల్లో పాఠశాలల్లో చేరేవారు 9వ దశకంలోనూ, 21వ శతాబ్దం ఆరంభంలోనూ దేశ ఆర్థిక వ్యవస్థను అభివృద్ధిపరుస్తూ వుంటారు. సాధారణ, సాంకేతిక పాఠశాలలూ, ఉన్నత విద్యాసంస్థలూ పాఠ్యాంశాల విషయంలోనూ, బోధనా పద్ధతుల విషయంలోనూ, భవిష్యత్ శాస్త్ర, సాంకేతికాభివృద్ధిని యిప్పటినుంచే అధికాధికంగా లెక్కలోకి తీసుకోనారంభించాలి.

ప్రజల సాంస్కృతికావసరాలను మరింత పూర్తిగా తీర్చే విషయంలో, గ్రంథ ప్రచురణనూ, వార్తా పత్రికల, మేగజైన్ల అమ్మకాలనూ మరింతగా విస్తరింపజేయటానికీ, వాటి సైద్ధాంతిక స్థాయిని పెంచడానికీ, స్వరూపాన్ని మెరుగు పరచటానికీ, నాటకశాలలను, సినిమా హాళ్ళను, చలన చిత్రాలను ప్రదర్శించే యంత్రాలను శాఖోపశాఖలుగా అభివృద్ధి పరచటానికీ, సాంస్కృతిక సంస్థలకు మరిన్ని సదుపాయాలు కల్పించడానికీ గొప్ప ప్రాముఖ్యం వుంది.

కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో, *ఆరోగ్య రక్షణ* రంగంలో గొప్ప కర్తవ్యాలను నెరవేర్చవలసి వుంది.

అన్నిరకాల వైద్య సహాయాన్నీ మరింతగా మెరుగు పరచటమూ, గ్రామీణ ప్రాంతాల్లోని వైద్య సేవా సౌకర్యాల స్థాయిని, పట్టణాల్లోని వాటి స్థాయికి దగ్గరగా తీసుకురావటమూ అవసరం. ఈ కర్తవ్యాలను పౌర ఆరోగ్య చట్టంలోనూ, "గ్రామసీమల్లో పౌర ఆరోగ్య వ్యవస్థను మరింత మెరుగు పరచేందుకూ, వైద్యశాస్త్రాన్ని అభివృద్ధి పరచేందుకూ తీసుకోవలసిన చర్యల గురించి" సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ, సోవియట్ మంత్రి మండలీ చేసిన నిర్ణయంలోనూ చాలా వరకు నిర్వచించటం జరిగింది. కొత్త ఆసుపత్రుల, పాలీ క్లినిక్కుల, వైద్య నియంత్రణా కేంద్రాల, ఆరోగ్య సదనాల, విశ్రాంతి గృహాల నిర్మాణం కొనసాగించబడుతుంది. 1975 నాటికి ఆసుపత్రుల్లో పడకల సంఖ్య 3 మిలియన్లకు పెరుగుతుంది.

9వ పంచవర్ష ప్రణాళికా కాలంలో *వ్యాయామ శిక్షణ, క్రీడల* అభివృద్ధి కొనసాగుతుంది.

పౌర ఆరోగ్య ప్రయోజనాల దృష్ట్యా, సహజ వాతావరణం విషయం శ్రద్ధ వహించాలి. అన్ని పట్టణాల్లోనూ, గ్రామాల్లోనూ, పారిశుధ్య పరిస్థితులను మరింత మెరుగు పరచాలి. సోవియట్ యూనియన్ సుప్రీమ్ సోవియట్ ఆమోదించిన, "భూమికీ, నీటికీ సంబంధించిన మూల సూత్రాల గురించిన చట్టాన్ని" కచ్చితంగా, నికరంగా ఆచరణలో పెట్టడం అవసరం.

కామ్రేడ్స్, కొత్త పంచవర్ష ప్రణాళికలోని సామాజిక కార్యక్రమాన్ని అమలు పరచినందువల్ల మన సమాజంలోని అన్ని తరగతుల జీవన ప్రమాణమూ పెరుగుతుంది.

అభివృద్ధి చెందిన సోషలిస్టు సమాజానికి అందుబాటులో వున్న వివిధ సాధనా లన్నిటినీ ఉపయోగించి సర్వత్రా సోవియట్ ప్రజల జీవన ప్రమాణాన్నీ, సాంస్కృతిక స్థాయినీ పెంచటం జరుగుతుంది.

పాదార్థికమైన, నైతికమైన శ్రామిక ప్రోత్సాహకాలు సమరసంగా జోడించబడేలా చూడటం అవసరం. వివిధ రకాల పాదార్థిక, నైతిక ప్రోత్సహకాలను ఉపయోగించి, పనిలో చక్కటి ఫలితాలనూ, సృజనాత్మకమైన చొరవనూ ప్రోత్సాహించాలి. ఈ ప్రోత్సాహకాలు వ్యక్తుల యోగ్యతలకు సమాజం గుర్తింపును ప్రతిబింబించేవిగాను, ఆ వ్యక్తిలో తన వృత్తిపట్ల గర్వభావాన్ని పెంచేవిగానూ వుంటాయి.

ప్రజల జీవన ప్రమాణాన్నీ, సాంస్కృతిక స్థాయినీ పెంచడం, సోషలిస్టు జీవిత విధాన యితోధిక పటిష్టతతోనూ, అభివృద్ధితోనూ విడదీయరాని విధంగా ముడిపడి వున్నది. కమ్యూనిస్టు నిర్మాణ క్రమంలో సోషలిజంలోని గొప్ప లాభాలు అధికాధికంగా ఆచరణ రూపం ధరించడాన్ని సోవియట్ ప్రజలు గమనిస్తూ వున్నారు.

చరిత్రలో మొట్టమొదటిసారి, సోషలిజం సమాజ సంపదను, సమాజంలోని యావ న్మంది సభ్యుల సొత్తుగా మార్చుతూ వుంది. సోవియట్ ప్రజల శ్రామిక వీరత్వానికీ, కమ్యూనిస్టు ఆశయాల పట్ల వారి నిష్టకూగల మూలకారణాల్లో, పార్టీ, ప్రజల అభేద్యమైన ఐక్యతకు మూలాధారాల్లో యిదొకటి.

# VI

# విదేశాలతో ఆర్థిక సంబంధాలు

కామ్రేడ్స్, అంతర్జాతీయ శ్రమ విభజనలో గల లాభాలను గరిష్ట స్థాయిలో వుపయోగించుకునే లక్ష్యంతో విదేశాలతో ఆర్థిక సంబంధాలను మరింతగా అభివృద్ధి పర్చట మన్నది 9వ పంచవర్ష ప్రణాళిక ముఖ్య కర్తవ్యాల్లో ఒకటి. సోవియట్ యూనియన్ యొక్క అంతర్జాతీయ స్థానాలను పటిష్టం చేసేందుకూ, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ఐక్యతను గట్టి పరచేందుకూ, దాని ఆర్థిక శక్తిని పెంచేందుకూ యిది సాయపడుతుంది.

సోవియట్ యూనియన్‌యొక్క విదేశ ఆర్థిక సంబంధాలలో, సోషలిస్టు దేశాలతో దాని సహకారం ఒక ప్రత్యేక స్థానాన్ని అలంకరిస్తూ వుంది. గడచిన ఐదేళ్ళలో సోవియట్ యూనియన్‌కూ, యితర సోషలిస్టు దేశాలకూ మధ్య సాగిన మొత్తం సరకు మార్పిడి పరిమాణం దాదాపు 50 శాతం పెరిగింది. పరస్పర ఆర్థిక సహాయ సమితిలోని (సి. యం. ఇ. ఏ) దేశాల మధ్య ఉత్పత్తి రంగంలోనూ, శాస్త్ర, సాంకేతిక రంగంలోనూ సహకారం గణనీయంగా పెరిగింది.

సోవియట్ యూనియన్‌కూ, సోదర దేశాలకూ మధ్య సన్నిహితమైన ఆర్థిక, శాస్త్ర, సాంకేతిక సహకారం సమతూకంగా అభివృద్ధి పొందేలా చూచేందుకు ముసాయిదా ఆదేశాలు కొన్ని నిర్దిష్ట చర్యలను ప్రతిపాదిస్తున్నవి. యంత్రాలు, రసాయనాలు, ముడి సరకులు, యింధనాలతో సహా, అనేక రకాల సరకుల సరఫరాను సోవియట్ పరిశ్రమలు గణనీయంగా పెంచుతాయి. ఉదాహరణకు, సి. యం. ఇ. ఏ దేశాలకు నూనె సరఫరా 1966-1970లో వుండిన 138 మిలియన్ టన్నుల స్థాయినుంచి 9వ పంచవర్ష ప్రణాళికా కాలంలో 243 మిలియన్ టన్నులకు, అదే విధంగా సహజవాయువు ఎగుమతి 8 వేల మిలియన్ల ఘనపు మీటర్లనుంచి 33 వేల మిలియన్‌లకు, విద్యుచ్ఛక్తి సరఫరా 14 వేల మిలియన్ కిలోవాట్ గంటలనుంచి 42 వేల మిలియన్ కిలోవాట్ గంటలకు, ముడి యినుము ఎగుమతి (లోహం) 72 మిలియన్ టన్నులనుంచి 94 మిలియన్ టన్నులకు పెరుగుతుంది. కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో మనం సి. యం. ఇ. ఏ దేశాలనుంచి రసాయన పరిశ్రమల కోసం 1.3 వేల మిలియన్ రూబుళ్ళ విలువగల యంత్రాలనూ, సుమారు 3 వేల మిలియన్ రూబుళ్ళ విలువగల రైల్వే, నౌకా రవాణా సాధనాలనూ, 8.5 వేల మిలియన్ రూబుళ్ళకు పైబడిన విలువగల పారిశ్రామిక వాడకం సరకులనూ దిగుమతి చేసుకుంటాం. సి.యం.ఇ.ఏ దేశాల నుంచి సోవియట్ యూనియన్‌కు పెద్దపెట్టున జరిగే సరఫరాలవల్ల, మన ఆర్థిక వ్యవస్థ అవసరాలను మరింత పూర్తిగా తీర్చుకోగలుగుతాం.

ఇప్పుడు అమలు జరుగుతూ వున్న సోషలిస్టు ఆర్థిక ఏలీనీకరణ కార్యక్రమం, సి. యం. ఇ. ఏ దేశాల సహకారానికిగల అపార శక్తిసామర్థ్యాల సర్వతోముఖ వినియోగాన్ని సుకరం గావిస్తుంది.

ఇంధనాల, ముడి పదార్థాల, ఖనిజాల వనరులలో గణనీయమైన పెరుగుదల సాధించేందు కోసం, మన ప్రణాళికా సంస్థలు, ఆర్థిక సంస్థలు, ఈ విషయంలో ఆసక్తిగల దేశాలతో ఉమ్మడి పథకాలను రూపొందించటంలో సహకరించగలవు; ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన వివిధ శాఖలపై ప్రత్యేక కేంద్రీకరణకూ, సహకారానికీ మార్గాన్ని ఏర్పరచ గలవు. అంతర్జాతీయ పెట్టుబడుల బ్యాంకు కార్యకలాపాలు విస్తరించటం ఈ సమస్యల పరిష్కారానికి దోహదం చేస్తూ వుంది. అంగీకృత పెట్టుబడుల విధానాన్ని పురోగమింపజేసేందుకు ఈ బ్యాంకు సహాయ పడుతుంది. 1970లో స్థాపించబడిన ఈ బ్యాంకు, పెద్ద ఎత్తున జరిగే నిర్మాణ కార్యక్రమాలకు ఉమ్మడిగా ద్రవ్యవనరులను సమకూర్చటంలో సి. యం. ఇ. ఏ దేశాల మధ్య సహకారాన్ని పెంపొందిస్తుంది.

ఆర్థిక, శాస్త్ర-సాంకేతిక సహకారాన్ని సర్వతోముఖంగా విస్తరింపజేయటంపైనా, దాన్ని ఆధారంగా చేసుకొని యితర సోషలిస్టు దేశాలతో—వియత్నాం ప్రజాతంత్ర రిపబ్లిక్, కొరియా జనతంత్ర ప్రజారిపబ్లిక్, క్యూబా రిపబ్లిక్, యుగోస్లావియా సోషలిస్టు ఫెడరల్ రిపబ్లిక్‌లతో—విదేశ వర్తకాల్ని పెంచడంపైన గూడా మనదేశం ఈ ఐదేళ్ళలో గొప్ప శ్రద్ధ వహిస్తుంది.

చైనాతో మన వర్తకాన్ని అభివృద్ధి పరచేందుకు, సోవియట్ యూనియన్ ఎన్నో చర్యలు తీసుకొంది. అయినప్పటికీ ఈ విషయంలో లభించిన ఫలితాలు రెండు దేశాలకూ వాస్తవంగా కల అవకాశాల కంటే ఎంతో వెనుకబడి వున్నవి. సరిసమానత, పరస్పర ప్రయోజనాలపట్ల గౌరవమూ అన్న ప్రాతిపదిక మీద, రానున్న సంవత్సరాల్లో చైనాతో వర్తక సంబంధాలను పురోగమింపజేసేందుకు మనం కృషి చేస్తాం.

రానున్న ఐదేళ్ళలో, ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాలల్లోని వర్ధమాన దేశాలతో సోవియట్ యూనియన్ విదేశ ఆర్థిక సంబంధాలను మరింతగా విస్తరింపజేయాలని ప్రణాళిక తలపెడుతూ వుంది. ఈ దేశాల్లో చాలా వాటితో—భారత్, ఆఫ్గనిస్తాన్, ఇరాన్, పాకిస్తాన్, ఐక్య అరబ్ రిపబ్లిక్, సిరియా, ఇరాక్, ఆల్జీరియా మొదలైన వాటితో—మన వర్తకమూ, ఆర్థిక సంబంధాలూ, దృఢంగా స్థిరపడిన, పరస్పర ప్రయోజనకరమైన ఆర్థిక బంధాలు అని చెప్పదగిన ఒక దశకు అప్పుడే చేరుకుంటున్నవి. సరిసమానత, పరస్పర ప్రయోజనాల పట్ల గౌరవమూ అన్న సూత్రాల ప్రాతిపదికపై ఆ దేశాలతో మన సహకారం, స్థిరమైన శ్రమ విభజన స్వభావాన్ని సంతరించుకొంటూ వుంది. అంతర్జాతీయ అర్థిక సంబంధాల రంగంలో సామ్రాజ్యవాద దోపిడీ వ్యవస్థను ఈ సహకారం ప్రతి

ఘటిస్తూ వుంది. అదే సమయంలో వర్ధమాన దేశాలతో వర్తకం పెరిగినందువల్ల, తన సొంత ఆర్థిక వ్యవస్థ అవసరాలను మరింత సంపూర్ణంగా తీర్చుకొనేందుకు సోవియట్ యూనియన్‌కు అవకాశం చిక్కుతుంది.

ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికా దేశాలతో సోవియట్ యూనియన్ ఆర్థిక సంబంధాలు, ఆ దేశాల జాతీయ స్వాతంత్ర్యానికీ, శాంతి, సామాజిక ప్రగతులకోసం సాగుతున్న సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట ఉమ్మడి ఆశయానికీ పటిష్టత చేకూర్చుతున్న వని విశ్వాసంతో చెప్పవచ్చు.

పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలతో కూడా మరింత విస్తృత మైన వర్తక సంబంధాలు పెట్టుకోవాలని మనం అభిలషిస్తున్నాం. ఫిన్లాండ్, ఫ్రాన్స్, ఇటలీ, జపాన్, జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్, ఆస్ట్రియాలతో మన ఆర్థిక సంబంధాల్లో వర్తక, ఆర్థిక, శాస్త్ర, సాంకేతిక, పరపతి, ద్రవ్య అంశాలు కూడా చేరివుండే దీర్ఘ కాలిక ఒప్పందాలు కుదుర్చుకోవాలనే ఒక ధోరణి, రూపుదాల్చుతూ వుంది. వర్తకాభివృద్ధికి యిది అదనపు అవకాశాలను సృష్టిస్తూ వుంది.

పెట్టుబడిదారీ దేశాలలోని పారిశ్రామిక, వాణిజ్యవర్గాలు సోవియట్ యూనియన్‌తో ఆర్థిక సంబంధాలను విస్తరింప జేసుకొనేందుకు తగినంత ఆసక్తి చూపితే, ఆ దేశాలతో మన వర్తకం గణనీయంగా పెరుగుతుంది.

ఈనాడు అంతర్జాతీయ పరిస్థితిని క్లిష్టం చేస్తున్న అపరిష్కృత సమస్యలను పరిష్కరించేందుకు పాశ్చాత్య దేశాలు నిర్మాణాత్మకమయిన చర్యలు తీసుకొని వుండి నట్లయితే, వాటితో మన ఆర్థిక సంబంధాలకు గల అవకాశాలు నేటి పరిస్థితికి పూర్తి భిన్నంగా వుండేదన్నది నిశ్చయం.

ఉదాహరణకు, యూరపు భద్రతా సమావేశాన్ని ఏర్పాటుచేసే విషయానికి సోవి యట్ యూనియన్ గొప్ప ప్రాముఖ్య మిస్తూ వుందని అంతా ఎరుగుదురు. యూరపు దేశాల్లో ఆత్మవిశ్వాసాన్ని పెంచేందుకు ఈ సమావేశం తోడ్పడగలదనీ, విస్తృతమైన ఆర్థిక, శాస్త్ర-సాంస్కృతిక సహకారానికి తోవతీయగలదనీ మనకు సుస్పష్టం. ఖండాంతర రవాణా వ్యవస్థ ఏర్పాటు; భారీ శక్తిగల విద్యుత్ సరఫరా మార్గాల ఏర్పాటు, దాన్ని ఆధారంగా చేసుకొని యూరపు అంతటికీ ఒకే ఒక విద్యుచ్ఛక్తి గ్రిడ్‌ను ఏర్పాటు చేయటం (విద్యుచ్ఛక్తి-యింధనాల సమతూకానికి సంబంధించిన సమస్యలను పరిష్క రించటంలో యిందువల్ల కీలకమైన ప్రగతి సాధించ వీలయ్యేది) —ఇలాంటి చర్యలు తీసుకొనేందుకు యూరపు భద్రతా సమావేశం తగిన పరిస్థితులను సృష్టించగలిగేది. అదే సమయంలో, యిది మానవ కార్యకలాపాలకు సంబంధించిన కొన్ని ముఖ్య రంగాల్లో

వి_స్తృత సహకారాభివృద్ధికి సాయపడ గలదు. ప్రకృతి పరిసరాల, అందులోనూ ప్రప్రధానంగా యూరపు ఖండానికి సంబంధించిన సముద్ర జలాల పరిశుభ్రత యొక్క రక్షణ, ఆ సముద్రాల వనరుల హేతుబద్ధ వినియోగం, గుండె జబ్బుల చికిత్సలోనూ, క్యాన్సర్ వ్యాధి నివారణలోనూఅనేక దేశాల శాస్త్రవేత్తలు తమ ఉమ్మడి కృషిని సాగించటం మొదలయినవి ఈ కార్యకలాపాలు.

సహజంగానే, ఇలాంటి కార్యకలాపాల ప్రాముఖ్యత కేవలం యూరపుకు మాత్రమే పరిమితం కాదు. అందుకనే మనం ఈ రంగంలో యితర దేశాలతో కూడా, ముఖ్యంగా కెనడా, జపాన్‌లతో సహకరించేందుకు సిద్ధంగా వున్నాం. అమెరికాతో సైతం మన రెండు దేశాల ఆర్థిక శక్తిస్తోమతలకు అనుగుణంగా వుండే స్థాయిలో ఆర్థిక సంబంధాలు అభివృద్ధి పొందేందుకు కూడా అవకాశం లేక పోలేదు. అలాంటి సహకారం, శాంతినీ, శాంతియుత సహజీవన సూత్రాలపై ఆధారపడిన పరస్పర సదవగాహననూ పటిష్టం చేసేందుకు దృఢమైన ప్రాతిపదిక కాగలదు.

సోవియట్ యూనియనూ, సోదర సోషలిస్టు దేశాలూ, భిన్న సామాజిక వ్యవస్థలు గల రాజ్యాలమధ్య శాంతియుత సహజీవనానికై నిరంతరం కృషి చేస్తున్నవి. మనం యుద్ధం అనివార్యమని భావించటం లేదు. అందుచేత రెండు వ్యవస్థల మధ్య ఆర్థిక పోటీని మనం కోరుతున్నాం. "ఉమ్మడి మార్కెట్" లాంటి, యితరులకు ప్రవేశం లేని ముఠా బందీలకు మనం వ్యతిరేకం. ఎలాంటి వివక్ష లేని బహుపక్ష అర్థిక బంధాల వి_స్తృత అభివృద్ధిని మనం కోరుతాం. ఇదీ మన సూత్రబద్ధ వైఖరి. శాంతియుత సహజీవన సూత్రాలకు కట్టుబడి వుండేటట్లయితే, సహకారం సాగించాలని కోరే ఏ దేశంతోనైనా సరే సహకరించేందుకు మనం సిద్ధమే. మనతో ఆర్థిక సంబంధాలపై ఆంక్షలు విధించడం ద్వారా, విచక్షణా పూరితమైన అడ్డుగోడల నేర్పరచటం ద్వారా, సోవియట్ యూనియన్‌కు హాని కలిగించ గలమని ఆశపడేవారు, స్వతంత్రంగా అభివృద్ధి చెందేందుకు దానికి వనరులు పూర్తిగా వున్నాయన్న సంగతి మరచిపోతున్నారు.

ప్రణాళికా సంస్థలూ, విదేశ వర్తక సంస్థలూ, పరిశ్రమలూ, విదేశాలతో ఆర్థిక బంధాల అభివృద్ధిని, వేరు వేరు శాఖల దృష్టితో గాక, మొత్తం జాతీయార్థిక వ్యవస్థకు వాటి ఫలదాయకత దృష్టితో పరిశీలించాలి.

మన విదేశ వర్తకాభివృద్ధీ, అంతర్జాతీయ ఆర్థిక, శాస్త్ర, సాంకేతిక సహకార వి_స్తృతీ, కొత్త పంచవర్ష ప్రణాళికా కాలానికి సంబంధించిన కర్తవ్యాలు జయప్రదంగా నెరవేరేందుకు తోడ్పడాలి.

*   *   *

కా॥మేడ్స్, పంచవర్ష ప్రణాళికల చరిత్ర, లెనినిస్టు పార్టీ నాయకత్వాన సోషలిజాన్ని నిర్మించిన, కమ్యూనిజానికి పాదార్థిక సాంకేతిక ప్రాతిపదికను జయప్రదంగా నిర్మిస్తూ వున్న సోవియట్ ప్రజలు సాధించిన ఘనమైన ఫలితాల చరిత్ర. ఒక ప్రణాళిక నుంచి మరో ప్రణాళిక నాటికి ఆర్థివ్యవస్థా, శాస్త్ర, సాంస్కృతిక రంగాలూ మన జాతీ యాదాయమూ, ప్రజల జీవన ప్రమాణమూ స్థిరంగా పెరుగుతూ వచ్చాయి: నానాటికీ మరింత పెద్ద సామాజిక సమస్యలు పరిష్కరించ బడుతూ వచ్చాయి.

మన అభివృద్ధి అన్ని దశల్లోనూ, మన పార్టీ మహాసభలు కమ్యూనిజానికి మనదేశ పురోగమనాన్ని నిర్ధారణచేసే చారిత్రక ఘట్టాలుగా ఉంటూ వచ్చాయి; నేటికీ అలానే వుంటూ న్నవి. మన పార్టీ యొక్క అత్యున్నత అధికారసంస్థ వచ్చే ఐదేళ్ళ కాలానికి నిర్ణ యిస్తున్న యితోధికాభివృద్ధి సాధారణ పంథా, యావత్తు పార్టీ యొక్క, యావన్మంది సోవియట్ ప్రజల యొక్క సంకల్పానికీ, విజ్ఞతకూ సంక్షిప్త రూపం.

9 వ పంచవర్ష ప్రణాళిక దేశ ఆర్థిక వ్యవస్థలోనూ, 250 మిలియన్ల మంది సోవియట్ ప్రజల జీవన ప్రమాణంలోనూ మరింత పెరుగుదల సాధించే ప్రణాళికగా వుంటుంది; మనం సాధించే ఫలితాలు సోషలిజం యొక్క ఆకర్షణ శక్తిని బ్రహ్మాండంగా పెంచుతాయి. సోవియట్ యూనియన్ యొక్క, ఇతర సోషలిస్టు దేశాల యొక్క ఆదర్శం అద్భుత ప్రభావాన్ని ప్రసరింప జేస్తుంది; ప్రపంచ మంతటా సామాజిక ప్రగతిని త్వరిత పరుస్తుంది.

కొత్త పంచవర్ష ప్రణాళిక, సోషలిస్టు ఉత్పత్తి సంబంధాల యితోధికాభివృద్ధి ప్రణాళికగా వుంటుంది. ఉత్పత్తి నిర్వహణలోనూ, సమాజ పరిపాలనలోనూ విస్తార శ్రామిక ప్రజా బాహుళ్యం చురుకుగా పాల్గొనేలా హామీ కల్పిస్తుంది. సోవియట్ సోష లిస్టు వ్యవస్థ అన్నిటికన్నా పురోగామి శీలమైన, అన్నిటికన్నా ప్రజాస్వామ్య యుతమైన వ్యవస్థ; కార్మికవర్గం యొక్క, రైతాంగం యొక్క, ప్రజల్లో నుంచి వచ్చిన మేధావుల యొక్క సృజనశీల శక్తులకు అన్నిటికన్నా ఎక్కువ అవకాశాన్ని ప్రసాదించే వ్యవస్థ.

మన పంచవర్ష ప్రణాళిక శాంతియుత నిర్మాణ ప్రణాళిక. సోవియట్ రాజ్య విధానం శాంతి, ప్రగతుల విధానమని అది నిరూపిస్తుంది. మన శాంతియుత నిర్మాణ పథకాలూ, మన శాంతి విధానమూ, సామ్రాజ్యవాదుల దురాక్రమణ విధానాన్ని ప్రతిఘటి స్తున్నవి. దేశ దేశాల ప్రజల ప్రయోజనాలకై, అంతర్జాతీయ ఉద్రిక్తతను సడలింప జేసేందుకోసం, మనం సర్వశక్తులనూ ఒడ్డి కృషి చేస్తున్నాం.

అభివృద్ధి నిరోధక సామ్రాజ్యవాద శక్తులు సైనిక దుస్సాహసాలకూ, ప్రత్యక్ష దురాక్రమణకూ ఒడిగడుతున్నవి; అంతర్జాతీయ న్యాయశాస్త్ర ప్రమాణాలను కాలరాచే

అమెరికా సామ్రాజ్యవాదులు, వియత్నాం, కాంబోడియా, లావోస్‌లలో సిగ్గుచేటయిన, అసహ్యాకరమైన, బందిపోటు యుద్ధాన్ని సాగిస్తున్నారు; మధ్యప్రాచ్యంలో దురాక్రమణను ప్రోత్సహిస్తున్నారు: ప్రపంచంలో ఉద్రిక్తతలూ, యుద్ధ ప్రమాదమూ కొనసాగుతున్నవి; —ఇలాంటి క్లిష్టమైన అంతర్జాతీయ పరిస్థితుల్లో మన సాయుధ బలాలను పటిష్టం చేయవలసిన, వాటి పోరాట సంసిద్ధతను యినుమడింప జేయవలసిన అవసరాన్ని విస్మరించే హక్కు మనకు ఏమాత్రం లేదు. కొత్త పంచవర్ష ప్రణాళిక మన దేశం యొక్క రక్షణ పాటవం మరింత పటిష్టమయేలా హామీ కల్పిస్తుంది.

ఈ పంచవర్ష ప్రణాళికా పరిపూర్తి మొత్తంగా సోవియట్ యూనియన్ యొక్క, ప్రతి ఒక్క యూనియన్ రిపబ్లిక్ యొక్క, మన మహా దేశంలోని సమస్త జాతుల యొక్క యితోధికాభివృద్ధిపై అపారమైన రాజకీయ, ఆర్థిక ప్రభావాన్ని ప్రసరింప జేస్తుంది; దేశ ఆర్థికశక్తిని మరింతగా పెంచుతుంది; యావన్మంది ప్రజల జీవితాన్నీ మరింత చక్కగానూ, ఆకర్షణీయంగానూ, పాదార్థికంగా మరింత సంపన్నమైనదిగానూ, ఆత్మికంగా మరింత అర్థవంతమైనదిగానూ, ఆసక్తిదాయకమైనదిగానూ చేస్తుంది.

దేశ వ్యాపిత పోటీ ఉద్యమంలో చక్కటి విజయాలు సాధించి, సోవియట్ ప్రజలు తమ కమ్యూనిస్టుపార్టీ 24 వ మహాసభను జరుపుకుంటున్నారు. పారిశ్రామిక రంగాన్ని మొత్తంగా తీసుకుంటే, ప్రణాళికలో తొలి మూడు మాసాలకు నిర్దేశించిన లక్ష్యాలను మించిపోవటం జరిగింది. పారిశ్రామికోత్పత్తి ప్రణాళికా లక్ష్యాన్ని మించి 103 శాతంవరకు జరిగింది.రోజువారీ సగటు ఉత్పత్తి గత సంవత్సరంలోని మొదటి మూడు మాసాల్లోకంటే 9.5 శాతం ఎక్కువైంది. అన్ని మంత్రిత్వ శాఖలూ, అన్ని యూనియన్ రిపబ్లిక్కులూ, పారిశ్రామికోత్పత్తిలో తమకు నిర్ణయించిన కర్తవ్యాలను నెరవేర్చాయి. మాంసము, పాలతో సహా పశు సంబంధ ఉత్పత్తుల సేకరణ విషయంలో, ప్రణాళికలో నిర్దేశించిన లక్ష్యాలనూ, అదనంగా నిర్ణయించిన లక్ష్యాలనూ కూడా మించిపోవటం జరిగింది. ఇది కొత్త పంచవర్ష ప్రణాళికారంభానికి చక్కని పూపు నిచ్చింది.

పంచవర్ష ప్రణాళికా లక్ష్యాలను పూర్తిచేసే కృషిలో శ్రామిక ప్రజల సృజనాత్మక చొరవ పెరగ గలదనీ, కమ్యూనిస్టు నిర్మాణంలో నూతన విజయాల సాధనలో యిది నిర్ణయాత్మకమైన అంశం కాగలదనీ మనం విశ్వసిస్తున్నాం.

సోవియట్ సమాజాభివృద్ధి చారిత్రక అనుభవం యావత్తూ, లెనిన్ అన్న ఈ క్రింది ముఖ్యమైన మాటలను చక్కగా నిరూపిస్తూ వుంది: "చారిత్రక ఘటనల స్థాయీ, విస్తృతీ ఎంత అధికంగా వుంటే, వాటిలో పాల్గొనే ప్రజల సంఖ్య కూడా అంత అధికంగానూ వుంటుంది. అదే విధంగా మనం తేగోరుతున్న మార్పు ఎంత ప్రగాఢమైనదైతే, ప్రజల

ఆసక్తినీ, దానిపట్ల విజ్ఞతా పూర్వక వైఖరినీ అంత ఎక్కువగానూ పెంపొందజేయవలసి వుంటుంది; అది అవసరమనే విషయాన్ని కోటానుకోట్ల మందికి నచ్చజెప్పవలసి వుంటుంది."

ప్రజాబాహుళ్యం యొక్క శ్రామిక కృషిని కమ్యూనిస్టు పార్టీ ఒక ఉమ్మడి లక్ష్యం దిశగా నడుపుతూ వుంది. కార్మికవర్గానికీ, యావన్మంది శ్రామిక ప్రజలకూ దానిపట్ల ఎనలేని విశ్వాసం వుంది. ఎప్పుడైనా సరే, ఏ కార్యకలాపాల రంగంలోనైనా సరే, నిస్వార్థ మయిన శ్రమకు, ప్రగాఢ పరిజ్ఞానానికి, అత్యున్నత నిర్మాణానికి, క్రమశిక్షణకు ఆదర్శ ప్రాయంగానూ, సూత్రబద్ధ వైఖరికి, లోపాలపట్ల అసహిష్ణుతకు, ఆదర్శప్రాయంగానూ వుండటం కమ్యూనిస్టులమైన మన విధ్యుక్త ధర్మం.

దాదాపుగా ప్రపంచంలోని అన్ని కమ్యూనిస్టు, వర్కర్స్ పార్టీల ప్రతినిధులు మన ఈ మహాసభలో పాల్గొంటున్నారు. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ విధానానికి గొప్ప విలువ నిస్తున్నందుకు మనం, మన మిత్రులకు కృతజ్ఞులం. మన ఆర్థిక రంగ విజయాలను వారు ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ పటిష్టతకూ, అంతర్జాతీయ కమ్యూనిస్టు, కార్మిక, ఉద్య మాల యొక్క, జాతీయ విముక్తి పోరాటం యొక్క అభివృద్ధికి ఒక ముఖ్యమైన దోహ దంగా పరిగణిస్తున్నారు.

అంతర్జాతీయ కార్మికవర్గమూ, ప్రపంచ మంతటిలోని ప్రగతిశీలురూ, మన పంచ వర్ష ప్రణాళికలను, సోషలిజానికీ, పెట్టుబడిదారీ విధానానికీ మధ్య జరుగుతున్న చరిత్రాత్మక మైన పోటీలో సాధించబడిన ఘనవిజయాలుగా ఎంచుతున్నారు. కొత్త పంచవర్ష ప్రణా ళికను గూడా వారు, ప్రపంచ మంతటా యావత్తు మానవజాతి కమ్యూనిస్టు విజయం దిశగా సాగించే సామాజిక ప్రగతిలో మరో ముందంజగా పరిగణిస్తున్నారు.

శ్రామికుని సంక్షేమమూ, అతడి వ్యక్తిత్వం పూర్తిగా, సర్వతోముఖంగా వికసిం చేందుకు తగిన పరిస్థితులను సృష్టించటమూనే మనం ప్రధానంగా ఆసక్తి వహిస్తున్న విషయం; అదే మన ప్రధాన లక్ష్యం అని కమ్యూనిస్టుల మయిన మనం, మన ప్రణాళికల ద్వారా, మన విధానం ద్వారా, యావత్ ప్రపంచంలోని శ్రామిక ప్రజలకూ తెలియ బరుస్తున్నాం.

మన పార్టీ 24 వ మహాసభ ఆమోదించనున్న 9 వ పంచవర్ష ప్రణాళిక ఆదేశాలు యావన్మంది ప్రజలు నిర్వహించవలసిన కార్యక్రమం.

సోవియట్ ప్రజలు జయప్రదంగా అమలు జరిపిన గత పంచవర్ష ప్రణాళిక లన్నిటితోనూ పోల్చిచూస్తే విస్తృతిలోనూ, తలపెట్టిన కర్తవ్యాల గొప్పతనంలోనూ,

సోవియట్ సమాజ జీవిత కీలక రంగాలన్నిటికీ వర్తించేదిగా వుండడంలోనూ ప్రస్తుత పంచవర్ష ప్రణాళిక మిన్నగా వుంది.

శ్రామిక స్త్రీ, పురుషులు ప్రతి ఒక్కరూ, యావన్మంది ప్రజల యొక్క ఈ మహాశయానికి తమ వంతు దోహదం చేకూర్చేందుకు సర్వ శక్తులనూ ఒడ్డి కృషి చేస్తారు.

పార్టీ సంకల్పం ద్వారానూ, యావన్మంది సోవియట్ ప్రజల సంకల్పమూ, నిస్వార్థ శ్రమ ద్వారానూ, 9 వ పంచవర్ష ప్రణాళిక పూర్తిగా జయప్రదం గావించబడగలదన్న విశ్వాసాన్ని వ్యక్తం చేసేందుకు నన్ను అనుమతించండి.

మహత్తరమైన లెనిన్ పార్టీ మనలను ఉజ్వలమైన నూతన విజయాలు సాధించే దిశలో, కమ్యూనిజానికి నూతన విజయాలు చేకూర్చే దిశలో ముందుకు నడుపుతూ వుంది!

కమ్యూనిజం నిర్మాత అయిన సోవియట్ మహా ప్రజ వర్ధిల్లు గాక!



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA134M154 |
| పుస్తకం పేరు | సోవియట్ సమీక్ష |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 88 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 84, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | RUKSANA |
| పేజీలు విడదీసినది | RUKSANA |
| స్కాన్ చేసినది | S. Jayashali |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good. |